# విశ్వప్రకాశం

విశ్వ సమైక్యత ప్రత్యేక సంచిక
జూన్ 1997

సంపుటి : 3 సంచిక : 8 వెల : రూ. 5-00



ముఖ్య సంపాదకులు :
శ్రీ పి.వి. మనోహరరావు

సంపాదకులు :
శ్రీ అక్కిరాజు రమాపతిరావు

సంపాదకవర్గం :
డా. బిరుదురాజు రామరాజు
డా. పోతుకూచి సాంబశివరావు
డా. దిట్టకవి శ్యామలాదేవి
శ్రీ కనుమలూరి వేంకటశివయ్య, ఐ.ఎ.ఎస్.
శ్రీ యం.యల్. నరసింహారావు



ప్రకాశకులు :
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్-500 380




ముఖచిత్రం :
**విశ్వ సమైక్యతా స్థూపం**

సంపాదకీయం



# మినీ ప్రపంచం

ప్రపంచంలో మానవసంఘాలు ఇప్పటికంటే ఇంకా నిరుపద్రవంగా, సుఖశాంతులతో, యోగక్షేమాలతో జీవించే అవకాశం ఇకముందైనా కలుగుతుందా? కలగాలంటే ఏంచేయాలి? నాగరక సమాజాల కర్తవ్యమేమిటి? మానవుడలవరచుకోవలసిన ప్రాథమిక ప్రవర్తన నియమావళి ఏమిటి? అనే ప్రశ్నలు మనసులో తలెత్తితే విచారమూ వైమనస్యమూ కలుగుతాయికాని ఆశ్వాసమూ ఆశా కలగవు. కలగటంలేదు.

'వసుధైవకుటుంబకం' అని వేల సంవత్సరాల నుంచి ప్రవక్తలు, మహాయోగులు, తత్త్వదర్శనులు, ఆధ్యాత్మిక దివ్యపురుషులు ఘోషిస్తూనే ఉన్నా కుక్కతోక చందంగానే వుంది అసాధారణ మానవుడి మనః ప్రవృత్తి. ఈ భూవలయంలో ఇంకా అనాగరక జాతులున్నాయి. ఆకలికి అలమటించిపోతున్న దేశాలున్నాయి. కరువులూ కాటకాలూ ఉత్పాతాలు మారణహోమాలు సంభవిస్తూనే ఉన్నాయి. ఒక సోక్రటీసు, ఒక ప్లేటో, ఒక జీససు, ఒక బుద్ధదేవుడు ఇలాస్థలిలో అవతరించారు. మానవాళిని ప్రబోధించారు. అయినా ఎప్పటికప్పుడు రోగం ముదురుతూనే ఉన్నది. రకరకాల చికిత్సలు విచికిత్సలు అవసరమవుతూనే ఉన్నాయి. ఏదేశానికీ సైనికవ్యవస్థ ఉండకూడదు అన్నాడుట బుద్ధదేవుడు. మానవసమాజ వర్గాలలో [illegible] సైనిక వ్యవస్థ పట్ల అయిష్టత, అనంగీకారం [illegible]రుట. అది సహజమే. ఆయన పరమ కరుణాళువు కాబట్టే, యుద్ధం, హింస, కలహం, కత్తి ఆయనకు ఏతరామూ గిట్టవు.

ఏదేశానికీ సైనికులు లేకపోతే ఎంతబాగుండును? అప్పుడు ఏదేశంలోనూ ఆకలీ, దారిద్ర్యం ఉండవు కదా! ఒక మేధావి అన్నాడు. చరిత్ర తెలిసినప్పటి నుంచీ ప్రపంచంలో జరిగిన యుద్ధాల నిమిత్తమై వ్యయమైన ధనం పరిగణిస్తే సమస్తభూవలయానికీ ఆరంగుళాల బంగారు రేకు హత్తవచ్చునని. సంపన్నదేశాలు, పరమ నాగరక దేశాలు స్వదేశరక్షణ, స్వప్రయోజన పరిరక్షణ పేరుతో ఎన్ని కోట్లకోట్ల కోట్ల సంపద వెచ్చిస్తున్నవి? ఈ దుర్వ్యయమే లేకపోతే ఆఫ్రికాలో ఆకలిచావులు ఆరబ్బుదేశాలలో అంతఃకలహాలు ఉండవు కదా! యుద్ధాలులేని కాలంలో ఈసైనిక వ్యవస్థను పోషించటం దండగ కదా ఏదేశానికైనా! వాళ్ళకు ఆకాలంలో కూచో బెట్టి తిండి పెట్టటం తప్ప మరి ఏదైనా ప్రయోజనం వుందా? శరీర పాటవం కోసం కసరత్తులు చేయిస్తారేమో? ఈ సైనిక బలాన్ని ప్రాజెక్టులు కట్టడంలోనో ఫాక్టరీలు నిర్మించడంలోనో వినియోగిస్తే త్వరత్వరగా జనసామాన్య సంక్షేమం కోసం ఉత్పాదకతను సాధించవచ్చును కదా! భూమి చాలక ఆకసాన్ని ఆక్రమిస్తున్నారు దురాశాపాతకులు. రేపు . హామండల యుద్ధాలు జరగవచ్చునేమో, ఇప్పటినుంచే సమాయత్తమవుతున్నారు

దురహంకారపూరితులు. తమదేశంలో ఆకలి దారిద్ర్యం, అనారోగ్యం, మురికివాడలు ఉన్నా వాళ్ళు పట్టించుకోరు. ఎప్పుడో ఎవరో తమ మీదికి యుద్ధానికి వస్తారేమోననీ లేదా తామే భండన సన్నద్ధులు కావల్సి ఉంటుందేమోననీ అప్రమత్తంగా సైనిక కార్యకలాపాలకోసం అపరిమితమైన ధనం వెచ్చిస్తుంటారు? ఇదా నాగరక సమాజ సంపన్నదేశాల సంస్కారం?

'ఆర్తస్యమత్సర నిదాఘ నిపీడితస్య' అని లక్ష్మీనరసింహకరావలంబస్తోత్రంలో శంకరుల వారన్నట్లు మాత్సర్యమనే గ్రీష్మతాపం కాలుస్తుండగా మానవుడు చల్లగా ఆలోచించలేడు. అమెరికా రష్యాల మధ్య పోటీలెందుకు? అధినాయకత్వ సముపార్జన స్పర్ధలెందుకు? హిందువులు మహమ్మదీయుల మధ్య విభేదాలెందుకు? భారతదేశంలో ఇంతింత అవినీతి ఎందుకు? మచ్చరపు చిచ్చు ఎందుకు? మతకలహాలెందుకు? ఇందుకూ అని ఎవరూ చెప్పలేరే! స్వప్రయోజనపరులు, దుష్టచిత్తులు తమ పబ్బం గడుపుకోవడానికి మతవర్గాలలో, కులసంఘాలలో లేని కలహాలు ప్రోదిచేస్తుంటారు. ఇటీవలిభారతదేశ చరిత్రలో ఇది పరమయధార్థం.

ఏభై అరవై ఏళ్ళ కిందటి వరకు భారతదేశంలో కుల వ్యవస్థ పరిగణనీయంగానే ఉండేది కాని కుల కక్షలు, ద్వేషాలు, అసహనాలు, ఉద్రేకాలు వాటిమధ్య ఉండేవికావు. కాని ఇప్పుడు కులవ్యవస్థ బీటలు వారింది. కాని కులకక్షలు, ద్వేషాలు, కార్పణ్యాలు అధికమైనాయి. ఇదంతా రాజకీయాధికార లాలసదురాత్ములు సాగిస్తున్న కపట నాటకం. సర్దుబాటు చేయవలసిన వాళ్ళు స్పర్ధాగ్ని జ్వాలలు ఎగసన దోస్తున్నారు? అందువల్ల సత్యాహింసలు బలిఅయిపోతున్నాయి. న్యాయానికి సామాన్యమానవుడికి ఇందువల్ల ఒనగూరే ప్రయోజనం ఏమీలేకపోగా ఎంతో ఆపదపాలవుతున్నాడు. సామాన్య పౌరుడికి కావల్సిందేమిటి? తినడానికి తిండి. చేయడానికి పని. నిర్భయంగా నిద్రించడానికి ఒకతావు. ఇవి ఈనాడు భారతీయ ఆధునిక సమాజంలో ఎందరికి లభిస్తున్నాయి?

సామాన్యమానవుడు, సగటు పౌరుడు ఎప్పుడూ శాంతి ప్రియుడే. పాపభీతుడే. తన వనరులతోనే తాను నెమ్మదిగా బతకాలనుకుంటాడు కాని ధనమదాంధులు, అధికార రోగపూరితులు వాళ్ళను అట్లా బతకనివ్వరు. వీరేశలింగంపంతులుగారు చాలా గొప్ప సత్యాన్ని ప్రస్తావికంగా ఒక సందర్భంలో ప్రకటించారు.దేశహితంకోసం పౌరరక్షణ కోసం ఏర్పడిన చట్టాలు పేదవాడిని బాధిస్తాయి; ధనవంతులు చట్టాలనే బాధిస్తారు అని. ఆయనే ఇంకోసారి ఇలా చెప్పారు. ఎ గితులలో చెడ్డ వాడు ఒకడైనా నూరుమంది వెయ్యిమంది పామరుల కన్నా ఎక్కువగా సామాజిక సుస్థితికి భంగం కలిగిస్తాడని. ఈనాటి రాజకీయనాయకుడికి కూడా ఇది వర్తిస్తుంది.

ఈ దేశంలో పరస్పర వర్గాల మధ్య కలహాలూ దుశ్చింతల అవసరం ఎంతమాత్రమూ లేదు. రాజస్థాన్‌లో ముస్లిములు హిందువులు పూజించే దేవతా విగ్రహాల నిర్మాణాన్ని జీవికగా

కొనసాగిస్తారని దిగవల్లి వేంకట శివరావుగారు తమ కథలు గాథలులో రాశారు. హిందువులు అత్యంత పవిత్రంగా పూజించే శ్రీ చక్రాన్ని ఎంతో శ్రద్ధతో కొలతలలో తభావతు ఏమీరాకుండా వాళ్ళు తయారుచేస్తారని ఆయన చెప్పారు. వారణాసిలో పట్టు బట్టల వ్యాపారం ముస్లిముల చేతుల్లోనే ఉంది. తెలుగు నాట నాదస్వర విద్వాంసులలో సగంమంది అన్యమతస్థులు అయాచోట్లవున్నారు. స్థానిక దేవతల పట్ల విశ్వాసంగలముస్లిములు ఎందరో ఉన్నారు. ఈ దేశంలో క్రైస్తవులు ఇంచుమించుగా అందరూ ఒకనాటి హిందువులే. ఆరాధనా విధానాలు వేరైనంత మాత్రాన అర్చనావిశ్వాసాలు ఒకటికానంతమాత్రాన కలహించుకోవలసిన పనిలేదేవాళ్ళకు! దుష్టుడెవరో ఈకలహాలకు అంకురార్పణం చేస్తున్నాడు. అది గ్రహించరే ఇరుపక్షాలవారూ, పరపక్షాలవారూ.

ఈ ఉపోద్ఘాతమంతా ఎందుకంటే ఇటీవలమద్రాసు నుంచి హైదరాబాదు వరకు రెండో తరగతి రైలు పెట్టెలో ప్రయాణం చేస్తుండగా సహప్రయాణీకుల ప్రవర్తన సమాజ భవిష్యత్థితికి ఎంతో అశావహంగా ఆలోచనలు రేకెత్తించింది. ఆ ఆలోచనలు మీతో పంచుకోవడానికే! యాదృచ్ఛికంగా ఆ కంపార్టుమెంట్‌లో హిందూ, ముస్లిం, క్రైస్తవ కుటుంబ సభ్యులున్నారు. రైలుకదలగానే పరస్పర కుటుంబ వృత్తాంత ప్రస్తావనలు మొదలు బెట్టారు. వృత్తి ఉద్యోగాలు, జీవిక వనరుల గురించి ఒకరినొకరు అడిగి తెలుసుకున్నారు. భోజనసమయంలో ఆపేక్షగా ఒకరికొకరివి అందించుకున్నారు. నిద్రా సదుపాయం విషయం లో ఒకరిపట్ల ఒకరు ఎంతో ఆదరం వ్యక్తం చేశారు. నిద్రకు ఉపక్రమించేముందు ఎవరి విశ్వాస్యదైవాలను వారు తలచుకొని ఉండవచ్చు. ఎవరికేమి అభ్యంతరం ఉంది? ఒక విశాల సంస్కృతికి వీరంతా వారసులే.

ఉదయంకాగానే పరస్పరం అభిమానంతో పలకరించుకున్నారు. తరవాత మళ్ళీ కలుసుకుందామని అర్థించుకున్నారు. వేరువేరు భాషలవారు వేరు మతాల వారు అయినా వారంతా ఒకే దేశంవారు. ఆదేశపు హితంపైనే వారి యోగక్షేమాలు ఆధారపడి ఉంటాయి. ఆ రైలు ప్రయాణం సజావుగా సకాలంలో ఎటువంటి అవాంతరాలు, ఉత్పాతాలు మధ్య సంభవించకుండా సాగినప్పుడే వాళ్ళ ఉనికికి భద్రత. మనికికి మాన్యత.

అదొక మినీ ప్రపంచం

మహాప్రపంచంకూడా ఇట్లా వ్యవహరిస్తే ఎంతబావుండును!

మానవ జీవితం కూడా ఒకయాత్రే కదా!

రైలు ప్రయాణానికి మానవజీవితం ఒక విస్తరణ వ్యాఖ్యానమే కదా!

ప్రయాణం సుఖంగా సౌకర్యంగా ఆనందప్రదంగా సాగాలని కోరుకుంటాడు మానవుడు. ప్రపంచం మనుగడకూడా ఇట్లా సాగితే ఎంతబావుండును!

# శ్రీ వల్లభ చరితామృతం

హిందీ మూలం : శ్రీ కళాధరభట్ తెలుగుసేత : డా॥ తిరుమలరామచంద్ర

ఈసేవ్యమూర్తులు స్వయంగా వల్లభులకు సేవ్యులు కావడం వల్ల "నిధిస్వరూపులు" అని వ్యవహారం పొందాయి. వల్లభులు ఉపదేశించిన ప్రకారమే ఆ ఆచార్య వంశీయులు కూడ ఈ నిధిస్వరూపాల సేవచేస్తున్నారు; మరిన్నీ వారు స్వయంగా ఆచార్యులు కావడం వల్ల, కొన్ని విశేషాభిప్రాయాలతో సేవాపద్ధతిలో, సిద్ధాంతానికి విరోధం లేకుండా పెక్కు పరివర్తనలుకూడ చేశారు. ఉదాహరణకు: ' మహాప్రభువుకు మొదట మకుటం, తలపాగా అనే రెండు శృంగారాలు ఉండేవి. శ్రీగోస్వామి (విఠ్ఠలేశ్వరులు) మకుటంలోనే సకల శృంగాగాలు చేశారు! ఇత్యాది-.

5క. వల్లభులు తమసేవ్యస్వరూపానికి చేసే సేవాప్రకారం సరలంగాను, సంక్షిప్తంగాను ఉండేది. తరచు నెమలి కన్నులు, గురివిందల దండ, వన్యపుష్పమాల మొదలయిన వాటి తో స్వామికి అలంకారం జరిగేది. అలాగే పాలు, పెరుగు, వెన్న, కండ చక్కెర, పండ్లు మొదలయినవి ఆరగింపు చేసేవారు. సేవాపద్ధతి శ్రీప్రభుచరణుల సమయంలో విస్తరించింది. వారిని మొగల్ చక్రవర్తివంటి ప్రభువులు, వీరబల్ వంటి ప్రభావ శాలులైన వ్యక్తులు ప్రశంసిస్తూ అనుసరించేవారు. భారతదేశపు నలుమూలలనుంచి గురువుల కానుకగా వచ్చే అసంఖ్యాకద్రవ్యరాశిని - ఇది ఇప్పటికీ సమర్పించబడుతున్నది - ఆచార్యవంశీయులు తమ సేవ్యనిధి స్వరూపానికే వినియోగించేవారు. అందువల్ల సేవాపద్ధతి వైభవోపేతం కాసాగింది. శిష్యులు ఎక్కువగా ఆకర్షితులు కావడానికి ప్రధాన కారణం, వల్లభుల సరళమైనా దార్శనికోపదేశం, వారి లోకోత్తర వ్యక్తిత్వమూను. వారి ఉపదేశం చాల సరళంగానూ హృదయంగమం గాను ఉండడంవల్ల, దానిని ఆచరించడం మానవుని నిత్యజీవితంలో స్వాభావికమైన ఒక భాగంగా కాదగి వుండేది. అంతేకాక, వల్లభవంశజుల విలక్షణ పాండిత్యం, పవిత్రచరిత్ర, ధార్మిక నిష్ఠాపూర్ణమైన జీవనం, ఈ సంప్రదాయంపట్ల ఆకర్షణకు, తదనుగుణంగా ఉత్తరోత్తరా ఆది వైభవోపేతంగా వృద్ధి చెందడానికి ప్రధాన హేతువులయ్యాయి.

5ఖ. వల్లభుల వంశం పుష్టిమార్గానికి గురుకులం (గురువంశం) అయింది. శ్రీవిఠ్ఠలేశ్వరుని ఏడుగురు కుమారుల వంశం ఏడుశాఖలయింది. ఈఏడుశాఖలలోను వారివారి దాయభాగంగా వచ్చిన సేవ్యస్వరూప కృష్ణవిగ్రహాల సేవ, వారి వారి ఇండ్లలో, వారివారి యింటిపద్ధతి ప్రకారం కొనసాగుతున్నది. శ్రీ విఠ్ఠలేశ్వరుని జ్యేష్ఠపుత్రుని దాయభాగానికి శ్రీనవనీతప్రియ మూర్తికాక ఈ వంశానికి కులదేవత అయిన శ్రీనాధమూర్తికూడ వచ్చింది. ఈశ్రీనాథమూర్తి ప్రస్తుతం శ్రీనాథ్ద్వారాలో విరాజిల్లుతున్నది. వల్లభుల వంశీయులకు

తమసేవ్య స్వరూపసేవ తమకుటుంబ ధర్మాచరణమైంది. దానిని వారు వెలుపలి ధార్మిక, సామాజిక, జాతీయమైన జోక్యాలేమీ లేక నిర్వహిస్తున్నారు. ఈ సేవలో సౌకర్యార్థం తమమార్గంలో బ్రహ్మసంబంధం స్వీకరించిన శిష్యులను సేవాకార్యానికి నియమిస్తున్నారు. వీరిలో కొందరు వేతనంతో పనిచేసే కార్యకర్తలున్నారు; కొందరు ధనవాంఛ లేక సేవావిధి కార్యభారంలో కొంత వహిస్తున్నవారు ఉన్నారు. ఈ విధంగా సహజప్రాప్తమైన గురుసేవను, గురువులసేవ్యమూర్తుల సేవను వారు తమ పరమభాగ్యంగా భావిస్తున్నారు.

6. హిందూ సంప్రదాయంలో దేవాలయమనే సంస్థకు ఏఅర్థం ఉందో పుష్టిసంప్రదాయంలో ఆ అర్థం లేదు. పుష్టిమార్గంలో సేవ వ్యక్తిగతం, సామూహికం కాదు. పుష్టిమార్గంలో సేవ సామూహికమో లేక సామాజికమో కాదని వల్లభులు చెబుతున్నారు. కర్మ మార్గపు ఉపాసన, పూజ మొదలైనవే సామూహికము, సార్వలౌకికము అనగా జన బాహుళ్యంలో ప్రచలించబడేదని వారి భావన. పుష్టిసంప్రదాయంలో అలాకాదు! భక్తిమార్గే ఏవం నాస్తీతి. అన్యత్రభగవద్భజనం నలోకసిద్ధమ్. స్వయం కర్మమార్గే తత్ వక్తుం సాధన మాహ: తపసాబ్రహ్మచర్యేతి! సుబో. వల్లభుల ఈ అభిప్రాయాన్ని వారిపౌత్రులు శ్రీవల్లభులు తమ లేఖ అనే గ్రంధంలో ఈ విధంగా నిరూపించారు. 'లోకాస్తు కామాత్మా నః, భక్తిమార్గే ఏవం నాస్తి, కామాత్మత్వం నాస్తీతి హేతోః కర్మాదిమార్గేభ్యోఽన్యత్ర భక్తిమార్గే భజనం లోకప్రసిద్ధం నాస్తి, వల్లభులు తమ సంప్రదాయంలో సామూహికగ్రహణం, భజనం మొదలైన సేవా పద్ధతి అసంభవ మన్నారు. సామూహికసేవ సేవకాదు; అది ఉపాసన లేక పూజ. అది కర్మమార్గవిషయం, పుష్టిమార్గ విషయం కాదు. పుష్టిమార్గంలో 'మందిరం' అనే దాని అర్థం ప్రాసాదమనో, ప్రశస్తమైన ఇల్లు అనో కాని, దేవాలయం కాదు. పుష్టి సంప్రదాయంలో సార్వజనిక పూజ సర్వధా నిషిద్ధం కావడం వల్ల ఈ సంప్రదాయానుయాయులకు కూడ సాంప్రదాయికమైన లేక సార్వజనికమైన దేవాలయం లేదు. పుష్టిమార్గీయులకు ఇల్లే దేవాలయం, దేవాలయమే ఇల్లు. దానిలో అన్య సంప్రదాయాల వాసన కూడ చొరడానికి అవకాశం లేదు. అది పుష్టి మార్గీయ సేవకు బాధకం. ఈ మార్గంలో గురువు తన సేవ్యమూర్తి సేవను, సేవకుడు తన ఏకైక దేవత అయిన కృష్ణుని సేవను తన ఆచార్య - గురు స్వరూపంతో నిర్వహిస్తారు. సేవలోని అంతర్గత భావాన్ని వల్లభులు ఎంత రసమయంగా భావించారంటే, సేవను తన ఆత్మీయులకు కూడ తెలుపక నిరంతరం రహస్యంగా ఉంచుకోవాలి అన్నారు. అంతరంగ మిత్రులకుకూడ తెలుపరాదు. అలాంటప్పుడు సార్వజనిక మైన ప్రసిద్ధిని ఊహించనైనా ఊహించలేము కదా! 'తేన స్వాంతరంగేష్వపి స్వస్మిన్ భగవదావిర్భావస్య సంగోపనం సూచ్యతే' సుబో.

7. హిందూసంప్రదాయంలోని గణపతి, శివ, సూర్య, రామ, మారుతి, దుర్గాది దేవాలయాల్లో సామాన్య హిందూ సంప్రదాయం వారందరూ స్వేచ్ఛగా ప్రవేశించి స్వయంగా భోగసామగ్రిని, డబ్బును, పాత్రవస్త్రాలంకరణాది పూజా పదార్థాలను సమర్పించి, పుష్పార్చన చేయవచ్చు, ధూపదీపనైవేద్యాలు చేయించి, నమస్కారపూర్వకంగా స్తోత్రాలు పఠించవచ్చు. కాని, పుష్టిమార్గంలో ఇలాటి దేవాలయాలు లేవు, ఇలాటి పూజా పద్ధతీ లేదు. పుష్టిమార్గంలో

ఆదిమూర్తి అయిన శ్రీకృష్ణునికే సేవ జరుగుతుంది. ఇతర విభూతుల సేవ నిషిద్ధం పుష్టిమార్గానుయాయి ఇతర విభవావతారాల దేవాలయాలలో ప్రవేశిస్తే అతడు బహిర్ముఖుడుగా పరిగణింపబడుతాడు, సేవామార్గంనుంచి బహిష్కృతుడవుతాడు.

8. నివేదితుడు-అనగా పుష్టిమార్గీయుడు అనివేదితులయినవారితో ఈ మార్గాన్ని గురించిన చర్చకూడ జరుపరాదని నిషేధం ఉంది. నివేదితుడు నివేదితునితో మాత్రమే సంభాషణ జరుపాలనే పద్ధతి ఉంది. 'నివేదితాత్మ భిన్నేషు సదౌదాసీన్యమాచరేత్'. భక్తిబీజం దృఢంకావడానికి వల్లభులు మూడు ఉపాయాలు తెలిపారు. 'త్యాగాత్ శ్రవణ కీర్తనాత్'. 'త్యాగాత్' అనే దాని అర్ధం ఈ మార్గానికి భిన్నమైన సకలసాధనసముదాయాన్ని త్యజించాలని, శ్రవణ కీర్తనాత్ అనే దాని అర్ధం భగవంతుడైన కృష్ణుని కీర్తన శ్రవణాలేకాని, తద్భిన్నుడైన ఏదేవుని శ్రవణసంకీర్తనలు కావు. నివేదితుడు కృష్ణుని వినా మరొక దైవాన్ని ఆశ్రయించడం మహాబాధకం. 'నహిభగవద్భక్తానాం అన్యనిష్ఠావ్యుచితా!' సుబో.

వల్లభులు అనన్య నిష్ఠాస్వరూపాన్ని సంక్షేపతః ఈవిధంగా చెప్పారు: శ్రీకృష్ణమనస్కుడు, శ్రీకృష్ణదేహుడు, కృష్ణాత్ముడు అయి నిర్గుణ కీర్తనలో అన్యమైనది సర్వథా విస్మరించాలి. 'తన్మనస్కాః తదాలాపాః తద్విచేష్టాః తదాత్మికాః, తద్గుణానేవ గాయంత్యోనాత్మాదారాణి సస్మరుః. 'భాగ. నివేదితుడు దైవాంతరాన్ని భజించడం, ఆ ను లక్ష్మిదేవాలయములకు వెళ్లడం, ఆ దైవాలను ఫలం కోసం యాచించడం ఎన్నటికీ చేయరాదు. 'అన్యస్యభజనం తత్ర స్వతో గమనమేవ చ, ప్రార్ధనాకార్యమాత్రేపి తధాన్యత్ర వివర్జయేత్' (వి.ఆ.) ఎందుకంటే, తనసేవ్యుడైన కృష్ణభగవానుని కాక మరొక దైవాన్ని పూజిస్తే సర్వనాశమై పోయే ప్రమాదం ఉంది. 'దేవతాంతర భజనేన తేషాంనాశః'-సుబో. భగవంతునికి నివేదించకుండా ఏ పదార్థాన్నైనా ఉపయోగించడం నిషిద్ధం, పరమదోషావహమూను "నివేదిభిః సమర్ప్యైవ సర్వం కుర్యాత్, అనివేదిత భోగే దోషః స్యాత్:- సుబో. భిన్నమార్గీయుల ప్రభావంతో ఉత్పన్నమైన పదార్థాలు కూడ పుష్టి మార్గీయుడైన జీవుని అపవిత్రం చేస్తాయి. 'భిన్న సత్తాకే జాతా, పదార్థాః భగవద్భక్తానాం శుద్ధి హేతవో నభవేయః'-సుబో. ఈనియమాల స్పష్టీకరణం 'చౌరాసీ, 'దోసాబావన్ వైష్ణవన్ వార్తాకీ' అనే గ్రంధాలలో పెక్కు విధాల కనిపిస్తుంది:- 'తబ్ వా వైష్ణవన్ నే వాకే సాస్ పోకహ్యోతుమ్ అన్యమార్గీయహో తుమ్ యామార్గ సునికే కహా కరోగే? యహ మార్గకీ చర్చాహం అన్యమార్గీయ ఆగే కహత నాహీ". (అప్పుడా వైష్ణవుడు తన అత్తగారితో ఇలా అన్నాడు: నీవు అన్యమార్గీయవు. ఈమార్గాని విని ఏమిచేస్తావు? ఈమార్గం చర్చ మేము అన్యమార్గీయుల ముందు చేయము.) అన్యమార్గీయులతో సంభాషించడంకూడ నిషిద్ధం - అన్యమార్గీయసో సంభాషణహూ న కరనో' 'జోపుష్టిమార్గీయఠాకుర్‌కెసివాయ్ అన్యఠాకుర్‌కేపాస్ సర్వథా ఎజా నో ఉన్‌కో దేఖనో నాహీ. ప్రసాదవేనో నాహీ. నాతరు అన్యాశ్రయ హోఈ' (పుష్టిమార్గస్వామిని వదలి ఇతరమార్గస్వాముల వద్దకు ఎన్నటికీ పోరాదు. వారిని చూడరాదు. ప్రసాదం పుచ్చుకోరాదు, అన్యదైవతాశ్రయం పొందరాదు.) స్వామికి సమర్పించని వస్తువును. ద్రవ్యమైనా, వస్త్రమైనా, భోజ్యపదార్థమైనా, అలంకారాభరణమైనా సర్వథా పరిత్యజించాలి.

ఇలాటి వస్తువును 'అన్‌ప్రసాదీ' - సమర్పితం కానివస్తువని అంటారు. ఇతర సంప్రదాయాలలో దైవానికి సమర్పించిన వస్తువు గ్రాహ్యంకాదని అంటారు. జోరాకూన్ కీ అన్‌ప్రసాదీ వస్తు సామగ్రీ ద్రవ్యాది సో వైష్ణవ కో సర్వధా సావధానరహనో'(స్వామికి సమర్పించని (అన్ ప్రసాదిఅయిన) వస్తు సామగ్రీద్రవ్యాదుల విషయంలో వైష్ణవులు హెచ్చరికతో మెలగాలి.) వల్లభులు అన్యాశ్రయాన్ని (అన్య దేవతాశ్రయాన్ని) భగవద్భావానికి బాధకమని భావించారు. వారు దీనిని 'బహిర్ముఖతా' అనే దోషంగా చెప్పారు. ఇలాటి బహిర్ముఖుడు సేవ చేయడానికి సర్వధా అనర్హుడని నిషేధించారు. 'బహిర్ముఖానాం సేవానిదారి, పుష్టిమార్గీయునికి అన్యసంబంధ గంధం కూడ మెడమీది బరువై బాధపెడుతుంది- 'అన్యసంబంధగంధోఽపి కంధారామేవ బాధతే.' ఇలాటి ఇతరదోషాలన్నీ హరిని విస్మరింపజేసేవని హరిరాయ మహాప్రభువులు అభిప్రాయపడుతున్నారు. -'ఏతేచేన్యేచ బోద్ధవ్యాదోషాని విస్మారకాః హరేః.

*"What we want is the harmony of existence, knowledge and bliss infinite For that is our goal. We want harmony, not onesided development And it is possible to have the intellect of a Sankara with the heart of a Buddha. I hope we shall all struggle to attain to that blessed combination" -Swami Vivekananda*

***Jnana Yoga** - p. 139 - (1961) Edition.*

**FULL MOON SERVICE STATION**

**INDIAN OIL DEALERS**

*Head Office :*

6-3-873, Begumpet, Hyderabad - 500 016.

Off. : 212618 Res. : 35489, 220012.

*Branch :*

Hyderabad - Bombay Highway,

Miyapur, R.R. Dist., Phone : 17

## దివ్యయోగి చరితామృతం

# చిరుమామిళ్ళ సుబ్బదాసు (1802 - 1882)

- ఆచార్య బి. రామరాజు

*(గత సంచిక తరువాయి)*

కాని సుబ్రహ్మణ్యం కారణజన్ముడనీ, అతనిమూలంగా చిరుమామిళ్ళవంశం అటు ఏడుతరాలు ఇటు ఏడుతరాలు పునీతమైనదనీ, మునుముందాతని పేరుకీర్తులు దేశం నలుమూలల వ్యాపిస్తాయనీ, ఆయనకు భగవత్సాక్షాత్కారం జరుగుతుందనీ, అటువంటివాణ్ణి సంసారజంబాలంలో ఇరికించటం బాగుండదనీ తాతాచార్యులవారన్నారు. నరసయ్య తమ వంశం నిలుపవలసిందిగా ప్రార్థిస్తూ ఆచార్యుల వారి కాళ్ళపై పడ్డాడు. ఆచార్యులవారు కరగిపోయి సరేనన్నారు. ఐతే పెండ్లి ఐనతరువాత సుబ్రహ్మణ్యంను కొంతకాలం తమవద్ద ఉంచవలెనన్నారు. నరసయ్య అందుకంగీకరించి ఆచార్యులవారి ఆశీస్సులందుకొని ఇంటికి తిరిగిపోయినాడు. ఆసాయంకాలం సుబ్రహ్మణ్యం వచ్చి ఆచార్యులవారికి సాష్టాంగపడి లేస్తే స్వామి రెండు పండ్లు ఆతని చేతిలో పెట్టి 'కల్యాణమస్తు; సుపుత్రప్రాప్తిరస్తు" అని దీవించినారు. సుబ్రహ్మణ్యం అవాక్కై కన్నీళ్ళతో తనకు సంసారం ఇష్టంలేదనీ తాను ఆశ్రయించినది దైవసాక్షాత్కారం కోసమనీ ఆచార్యుల వారిని దీనంగా వేడుకున్నాడు. గృహస్థులుగా ఉంటూ దైవసాక్షాత్కారం పొందిన భక్తుల, యోగుల, జ్ఞానుల చరిత్ర ఆచార్యులవారుదాహరించి, తల్లిదండ్రుల యెడ ఆతని బాధ్యత బోధించి, రాజయోగిగా గార్హస్థ్యం నిర్వహించే పద్ధతి చెప్పి ఒప్పించినారు. ఆసంవత్సరం మాఘమాసంలో సుబ్రహ్మణ్యంకు మేనమామ ఓబులేశునిపల్లె అ(క)బ్బయ్య కూతురు వేణమ్మతో పెండ్లి జరిగింది. అప్పటికి వరునికి 20 వధువుకు 10 ఏండ్లు.

పదహారోపండుగు తరువాత సుబ్రహ్మణ్యం తాతాచార్యులవారి ఆశ్రమంలో చేరిపోయినాడు. ఆచార్యులవారాయనకు పంచకావ్యాలు భారతభాగవతాలు ప్రస్థానత్రయం బోధించినారు. ఆయనడిగే శంకలన్నిటికీ సమాధానాలు చెప్పినారు. వేదాంత యోగశాస్త్రములు అందులోని మర్మాలు అనుభవంలోనికి వచ్చేటట్లు నిరూపించినారు. చెప్పవలసిందంతా చెప్పి దీక్ష యిచ్చి సుబ్బదాసని నామకరణం చేసినారు. తత్క్షణమే సుబ్బదాసు హృదయం అంతరాంతరాలు ఒక దివ్యతేజస్సుతో నిండిపోయినవి. ఆపూటంతా ఆయన ధ్యానంలో ఉన్నాడు. ఆయనకు నిశ్చలసమాధి కుదిరింది. అటుతరువాత సుబ్బదాసు క్రమంగా తీవ్రసాధన చేసినాడు. తత్ఫలితంగా ఐదేండ్లలో గుర్వనుగ్రహంతో సుబ్బదాసుకు గొప్ప ఆధ్యాత్మికశక్తులు సంక్రమించినవి. సంసారంలో ఉంటూ సుబ్బదాసు ద్వంద్వాతీతుడైనాడు.

గురువు-తల్లిదండ్రుల కోరికమేరకు వంశం నిలపటానికి-నరసన్న-రామకృష్ణయ్య-అనే ఇద్దరు కొడుకులను కన్నాడు. అటుతరువాత వేణమ్మకూడ సుబ్బదాసువలె గృహతాపసి ఐనది. భర్తకనుసన్నల్లో మెదలుతూ సంసారం చక్కదిద్దుతూ అతిథి అభ్యాగతులను మన్నిస్తూ ఋషిపత్నివలె జీవితం గడిపింది. మహాపురుషుల జీవితాల్లోను సుఖంకంటె సమస్యలు కష్టాలే ఎక్కువ. ఐతే వారు కష్టసుఖాలు రెండూ పరమేశ్వర ప్రసాదంగా స్వీకరిస్తారు; ద్వంద్వాలకు అతీతంగా ఉంటారు; హాలాహలం మ్రింగి అమృతం అనుగ్రహిస్తారు. భగవంతుడు వారికాశక్తి నిస్తాడు. అట్టి శక్తితో వారు లోకానుగ్రహకాంక్షతో అనేకాద్భుతాలు లీలలు చమత్కారాలు చేస్తారు. చిరుమామిళ్ళ సుబ్బదాసు జీవితంలోను భగవంతుడాయనను అనుగ్రహించిన ఘట్టాలు సన్నివేశాలు పెక్కులు.

1. తండ్రి పెద్దవాడైన తరువాత సుబ్బదాసే వ్యవసాయం పనులు చూచేవారు. ఒకనాడు పండిన వరిగచేను కోత మొదలుపెట్టించి భోజనానికి ఇంటికి వచ్చినాడు. కూలీల నాయకుడు పురుషోత్తమదాసు పంచముడు; సుబ్బదాసుకు అంతరంగ భక్తుడు. అతడు మనస్సు భగవదర్పితం చేసి శరీరం వరిగెకోత కప్పగించినాడు. తోడి కూలీలు ఆతణ్ణి అనువర్తించినారు. వంచిన నడుము ఎత్తకుండా భగవన్నామం చేస్తూ పురుషోత్తమదాసు చేను కోస్తూ తమగట్టు దాటి మరొకరి భూమిలోనికి పోయి కోత సాగిస్తున్నాడు. సుబ్బదాసు ఇంటినుండి తిరిగి వచ్చి అది చూచి మందలించినాడు. పురుషోత్తమదాసు తన మైమరుపుకు సిగ్గుపడి క్షమాభిక్ష వేడినాడు.

సుబ్బదాసు పురుషోత్తమదాసుకు నమస్కరించి "నీవు నాకు దేశికుడవైనావు. నీమనోవృత్తి ననుసరించి ధ్యాననిష్ఠ సాగిస్తాను" అని అదేవిధంగా ధ్యానసమాధిని ఆర్జించినాడు.

2. సుబ్బదాసు ఒకనాడు పొలం దున్నుతుండగా బాలకృష్ణలీలలు ఆయన మన: ఫలకంపై ఆడినవి, హృదయం ఆనందతుందిలమైనది. అరకనాపి గట్టుకు వచ్చి సంచిలోనుండి తాటాకులు గంటం తీసి శ్రీకృష్ణలీలామృతమనే యక్షగాన ప్రబంధం వ్రాయట మారంభించినాడు. ఆ కవితా సమాధి ఎంతసేపున్నదో తెలియదు. కొన్నిగంటల తరువాత పొలంవైపు చూస్తే ఒక నల్లని ఆజానుబాహువు పొలం దున్నుతున్నాడు. సుబ్బదాసు పరుగెత్తి కృతజ్ఞతలు తెలిపి పల్కరిస్తే ప్రక్క ఊరు గొల్లననీ, తమ గొప్పతనం తెలుసుననీ, అప్పుడుపుడు చూస్తుంటాననీ, తమవంటి వారికి తోడ్పటం తన భాగ్యమనీ, ముల్లు కర్ర అప్పగించి తన దారిన సాగిపోయినాడు. సుబ్బదాసు ఇంత అవ్యాజంగా తనకు మేలు చేసిన ఆగొల్లనివైపే చూస్తున్నాడు. చూస్తుండగానే ఆవ్యక్తి అదృశ్యుడై పోయిన తరువాత సుబ్బదాసుకు అతడు సాక్షాత్తు దుర్గి వేణుగోపాలస్వామి అని మనస్సులో తళుక్కుమన్నది. వేణుగోపాలస్వామి గొల్ల వేషంతో వచ్చి తన పొలం దున్నిపోయినందుకు ఆనందించినా తనివిదీరా మాట్లాడి పాదాలైనా అంటకపోతినే అని బాధ పడ్డాడు.

3. ఒకసారి అడిగొప్పుల నుండి వచ్చిన చిలుకల వెంగళరెడ్డి దంపతులతోపాటు తమ శిష్యులూ కోరితే సుబ్బదాసు తమ కృష్ణలీలామృతం వినిపిస్తున్నారు. అట్లా వినిపిస్తూ హఠాత్తుగా వివశులై "ఆగు ఆగు" అంటూ అదలించినారు. ఆచర్యలకు అర్థం తెలియని చుట్టున్నవారడిగితే దుర్గిలో స్వామిగుడిముందు రెండు ఆబోతులు భయంకరంగా పోరాడుతుంటే అదలించి దూరం కొట్టినామన్నారు. అది విన్నవారు దుర్గికి పోయి విచారిస్తే గుడిముందు రక్తసిక్తమయ్యేటట్లు పోరాడుతున్న ఆబోతులు హఠాత్తుగా చెరి ఒక దిక్కు పారిపోయిన వింత విషయం ధ్రువపరచినారు. సుబ్బదాసు యోగశక్తులున్న మహిమాన్వితుడనీ దుర్గిలోను ధర్మవరంలోను చెప్పుకున్నారు. అప్పటినుండి ఆయన దర్శనానికి వచ్చి సుఖదుఃఖాలు చెప్పుకోవటం తీర్థప్రసాదాలు తీసుకపోవటం భజనగోష్ఠుల్లో ప్రవచనాల్లో పాల్గొనటం ఆరెండు గ్రామాల వారికి పరిపాటి ఐనది.

4. ఇన్నాళ్ళు మొద్దు, పిచ్చివాడు, ఆచారం పట్టి సన్యాసుల్లో కలసిపోయిన వాడనుకున్న సుబ్బదాసుకు ఈవిధంగా పేరు ప్రఖ్యాతులు రావటం అందరి ఆదరాభిమానాలు గౌరవం చూరగొనటం కొందరు తామసప్రవృత్తులకు నచ్చలేదు. వారు నిష్కారణంగా ఇతరులను బాధ పెట్టి సంతోషిస్తుంటారు. అటువంటి పలుకుబడి గల ఇద్దరు రైతులు మరొక మూర్ఖునికి పురి ఎక్కించి ఉసికొల్పినారు. వాడు పొగరుబోతు బలిష్ఠుడు. వాడు తన రెండెడ్లను సుబ్బదాసు పొలంలోనికి తోలినాడు. సుబ్బదాసా మూర్ఖునికి తన పొలం మేపించవద్దని నయంగా చెప్పినా వాడు నోటికి వచ్చినట్లు కూసినాడు. ఈ అన్యాయం రెండు దినాలు సాగింది. మూడవనాడు సుబ్బదాసు మనసు నొచ్చుకొని నాకు నష్టం కలిగిస్తే భగవంతుడూరుకోడంటూ ఇంటికి వెళ్ళిపోయినారు. ఆనాడు రాత్రి ఆరెండెడ్లూ హఠాత్తుగా చచ్చిపోయినవి. ఈ వార్త ఊరంతా పాక్కింది. సుబ్బదాసును కష్టపెట్టినందుకు భగవంతుడు వెంటనే శిక్షించినాడని ఆరైతు ఏడుస్తూ పోయి సుబ్బదాసు కాళ్ళపైన బడ్డాడు. పశ్చాత్తప్తులను భగవంతుడు క్షమించి కాపాడుతాడని, అభయం ఇచ్చి సుబ్బదాసు వాణ్ణి పంపినారు. వాడు తన ఇల్లు చేరేవరకు ఆతని బావమరది ఎడ్లపందెంలో గెలిచిన రెండెడ్లు పొరుగూరినుండి తన యింటికి వచ్చినవి. వాడు సుబ్బదాసుకు భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

5. పగపట్టిన మోతుబరి రైతు సోదరులు సుబ్బదాసు మాంత్రికుడనీ, రాత్రిపూట శ్మశానంలో మంత్రాలు చదువుతాడనీ, కనుకట్టు విద్యలతో మోసగించి గొప్పవాడైపోతున్నాడని దుష్ప్రచారం చేయటానికీ, సుబ్బదాసు దినచర్యలు గమనించటానికీ, గూఢచారులను నియోగించినారు. ఒకనాడుదయం బ్రహ్మముహూర్తాన సుబ్బదాసు దుర్గి వేణుగోపాలస్వామిగుడికి బయలుదేరినారు. రాత్రి కురిసిన వానకు దారిలోని చెరువు నిండింది. సుబ్బదాసు గంగకు నమస్కరించి దారిమ్మని ప్రార్థించి నేలపై నడచినట్లే చెరువునీటిపై నడుచుకుంటూ గుడికి పోయినారు. పొంచి చూస్తున్నవారు ఈవార్త రైతు సోదరులకు చెప్పితే వారు ఇది కనుకట్టు పొమ్మన్నారు. అదివారి సంస్కారం. అటువంటివారు నాడూ నేడూ ఉన్నారు.

6. ఒకసారి అడిగొప్పుల ఒప్పిచెర్ల గ్రామాల్లో కలరా ప్రబలి చాలామంది చనిపోయినారు. సుబ్బదాసు మాహాత్మ్యం విన్నకొందరు సజ్జనులు వచ్చి తమగ్రామాల ప్రజలను రక్షించండని ప్రార్థిస్తే ఆయన తల్లిదండ్రులకు భార్యాపుత్రులకు చెప్పి వెంటనే దేవతార్చనతో బయలు దేరినారు. అడిగొప్పుల చేరి స్నానం భగవదారాధన ముగించి ఆంజనేయుని స్తుతించినారు. ఆస్తోత్రం అక్కడి ప్రజల చేత పాడించినారు. రాత్రి ప్రొద్దు పోయేదాకా దివ్యనామసంకీర్తనంతో ఆగ్రామం మారుమ్రోగింది. సుబ్బదాసు ఆగ్రామీణులకు శుచి, శుభ్రత, భగవన్నామ మాహాత్మ్యం గురించి బోధించి తనకు తెలిసిన, చెట్లమందు లిచ్చినారు. ఈవిధంగా మూడుదినాలు పగలంతా రోగులయిండ్లు తిరిగి మందులిస్తూ హరినామ సంకీర్తనం చేస్తూ సాయంకాలం ఆధ్యాత్మిక విషయాలు సదాచారం సత్ప్రవర్తన ప్రేమ దయాదిగుణాల గూర్చి ప్రబోధిస్తూ పురాణాల్లోని ధార్మిక కధలుదాహరించి సామూహిక భజన చేయించినారు. కలరా తగ్గిపోయింది. ఊరెవారంతా ఆయనకు బ్రహ్మరధం పట్టి ఆయన పాదాల వద్ద ధనకనకాలు కానుకలుంచినారు. దాసుగారు చిల్లి గవ్వైనా ముట్టకుండా వారిప్రేమను మాత్రం గ్రహించి ధర్మవరం తిరిగి వచ్చినారు. ఆయనకంటెముందు ఆయన కీర్తి ధర్మవరం చేరింది. ఇంకొకసారి శ్యామరాజపురం మాడుగుల రావలకుంట రెంటాల ఒప్పి చెర్ల గ్రామాల్లోకూడ ఇటువంటి పరిస్థితే సంభవిస్తే దాసుగారు ప్రతియింటినుండి ఒక యువకుని తోడ్కొని ఒకదండుగా ఘటించి ఈగ్రామాలన్నీ తిరిగి దివ్యనామసంకీర్తనంతో మారుమ్రోగించి చెట్లమందులిచ్చి కలరా తగ్గించినారు. ఆమండలమంతా సుబ్బదాసు వశ్యవాక్కనీ అష్టసిద్ధులున్న యోగి అనీ, మహాభక్తుడనీ కీర్తి వ్యాపించింది.

7. సుబ్బదాసు ప్రతిదినం దుర్గివేణుగోపాలస్వామి గర్భగుడి చొస్తున్నాడనీ అది నిరోధించండనీ ఆరైతుసోదరులు గుడి పాలకమండలివారిని రెచ్చ గొట్టినారు. వాళ్ళు కాపలా ఉండి గుడి తలుపులు మూసినారు. ఎప్పటివలె దర్శనానికి దాసుగారు వస్తే గుడితలుపులు తెరుచుకోలేదు. ఆయన చాలాసేపు భగవత్ స్తోత్రం చేసి వివశుడై తలుపులకు తన తల బాదుకున్నాడు. భాగా రక్తం కారింది. భగవంతుడు తేజోరూపంగా ప్రకటమై భక్తుని పల్కరించి ఊరట కలిగించినాడు. దాసు తనకింకా తనువు అక్కరలేదనీ తన చరణాల్లో చేర్చుకొమ్మని భగవంతుని వేడితే వల్లెయని అంతర్హితుడైనాడు. ఆ దివ్యతేజస్సుకు కండ్లు మిరుమిట్లుగొన్న పాలకమండలివారు కొంతసేపటికి తేరుకొని పశ్చాత్తప్తులై దాసుగారిని క్షమాభిక్ష వేడినారు.

దాసుగారి శిష్యుల్లో ప్రధమగణ్యుడు అడిగొప్పులవాసి చిలుకల వెంగళరెడ్డి. దాసుగారివద్ద దీక్షితుడై సాధనచేసి యోగసిద్ధులు గడించినవాడీ రాజయోగి. ఆయన అడిగొప్పులలో ఉన్నా ధర్మవరంలో ఉన్న తమగురువుల దినచర్యలు యోగదృష్టితో చూచి చెప్పేవాడు. సుబ్బదాసుగారికి దుర్గిలో భగవంతుడు ప్రత్యక్షమై ఆయన కోర్కెను మన్నించిన విషయం అడిగొప్పులనుండి వెంగళరెడ్డి దర్శించి తన భార్యకు చెప్పినాడు. గురువు కంటె ముందుగనే తాను వెళ్ళిపోవలెనని

సంకల్పించుకొని ఆనాడు మధ్యాహ్నం స్వామికి నివేదన చేసి ధ్యానయోగంలో తనువు చాలించినాడు. గృహతాపసి రెడ్డిగారి భార్య ఆవార్త చెప్పటానికి మనిషిని ధర్మవరం పంపినది. వార్తాహరుడు చెప్పకముందే సుబ్బదాసుగారు రెడ్డి ఆత్మ పరమాత్మలో కలిసిపోయిందనీ, వగవనక్కరలేదనీ, వృద్ధుడైన తాను రాలేననీ ఆమెకు వార్త పంపినారు. రెడ్డి, గురువుగారి సమాధిపై చిలుక బొమ్మై ఈనాడు పూజలందుకుంటున్నాడు.

సుబ్బదాసుగారు దేహం చాలించే ముందు శిష్యులను రప్పించుకొని ఇన్నాళ్ళు తాము రచించిన కృతులు తాటాకులు చూపించి వాటిని కాపాడుకొండనీ తమకు ప్రభువు ఆజ్ఞ ఐనదనీ చెప్పినారు. శిష్యులు ఏడుస్తుంటే మాయాకల్పితజగత్తు దాని మిథ్యాత్వం బోధించి వాళ్ళ భ్రాంతి తొలగించి వివేకోదయం చేయించినారు. శా.శ. (౧౮౦౩) వృష సంవత్సరం పుష్య బహుళ అష్టమి గురువారం (12-1-1882) నాడు బ్రహ్మ ముహూర్తంలో స్నానానుష్ఠానాలు ముగించి భగవద్ధ్యానంలో చాలాసేపుండి పూజాగృహం వెడలి వచ్చి భార్యా పుత్రులను కోడండ్లను శిష్యులను పల్కరించి తాము వెళ్ళిపోతున్నామన్నారు. వేణమ్మ మహాపతివ్రత, భర్తనీడలో భక్తియోగంలో పండిన సాధ్వి, చిరునవ్వుతో వీడ్కోలు చెప్పి, దాసుగారు నాలుగడుగులు వేయగనే కుప్పకూలి ప్రాణాలు విడిచింది. దాసుగారు గ్రామం బయట చిన్ననాడు ఒక యోగి తమనాల్కపై బీజాక్షరాలు వ్రాసినచోటు చేరి యోగసమాధి స్థితులై కపాలభేదనం చేసుకొని పరమాత్మలో లీనమైపోయినారు. ఆయన శరీరంనుండి ఒక కాంతిపుంజం ఆకాశం వైపు దూసుకపోవటం చుట్టున్న బంధువులు శిష్యులు చూచినారు. విధివిధానోక్తంగా అంత్యక్రియలు జరిగినవి. ఈనాడు ధర్మవరంలో సుబ్బదాసుగారి సమాధి యోగులకు భక్తులకు కవిపండితులకు యాత్రాస్థలం. ప్రతి యేట పుష్యబహుళ అష్టమి నవమి గురుపూజోత్సవాలు జరుగుతున్నవి. మొదటినాడు ఆరాధనోత్సవం జరుగుతుంది. దాసుగారి ఉత్సవ బేరానికి ఊరేగింపుంటుంది. గ్రామాలనుండి ప్రభలు వస్తాయి. రాత్రి భజన గోష్ఠులు సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతవి. రెండవనాడు గురుపూజోత్సవం; భక్తులు తలనీలాలిస్తారు, శిశువుల పుట్టు వెంట్రుకలు తీస్తారు. మ్రొక్కులు చెల్లిస్తారు. అన్న సంతర్పణముంటుంది.

సుబ్బదాసుగారి వ్యక్తిత్వం చాలా ఆకర్షకం. కాయికం చేసి కండలు తేరిన సమున్నత శరీరం, పసుపు ఎరుపు కలిసిన పండుటాకురంగు, విశాల ఫాలం, బట్టతల, తామర రేకులవంటి విశాలనేత్రాలు, ద్వాదశోర్ధ్వపుండ్రాలు మెడలో తులసీమాల, అచ్చం పరమభాగవతవేషం వారిది.

సుబ్బదాసుగారెంతటి యోగులో జ్ఞానులో అంతటి భక్తులు. ఆయన యోగ భక్తి జ్ఞానముల కూడలి, సహజ కవి. ఆయనకు కవితాగురువులు లేరు. చిన్నప్పుడు 8వ యేటనే కవిత్వరచన కుపక్రమించినారు. ఆయన కృతులు తెలుగు దాససాహిత్యంలో ఆణిముత్యాలు.

శతకాలు, యక్షగానాలు, నక్షత్రమాలికలు, అష్టకాలు, తత్త్వాలు, కీర్తనలు, పాటలు పండితపామరులు పాడుకునే విధంగా చాలా కృతులు దాసుగారు రచించినారు. పంగులూరి వీర రాఘవుడుగారు 1. కేశవ శతకం (ఆశుధార) 2. సగుణ నిర్గుణ కందార్థములు 3. గోపాల శతకం (నిందాస్తుతి) 4. త్రిలోకవందిత శతకం 5. చిత్తశతకం 6. భక్తవశవర్తి శతకం 7. విజ్ఞాన దండకం 8. నీతి బోధ (యాలలు) 9. వేదాంత కీర్తనలు సుబ్బదాసుకృతులుగా పేర్కొన్నారు. అడివి సూర్యకుమారి 10. శ్రీరామ కందపంచవింశతి 11. శ్రీకృష్ణ లీలామృతం (యక్షగానం) 12. నానార్థస్తవం 13. ఆంజనేయాష్టకం 14. రామసీసపంచకం 15. ప్రహ్లాదచరిత్ర (యక్షగానం) 16. అంబరీషోపాఖ్యానం -ద్విపద 17. గోపాల సంకీర్తనం 18. సర్వలఘుసీసం 19. గోపాలస్మరణం (పాట) 20. తత్త్వాలు కీర్తనలు పేర్కొన్నారు. కర్నాటి వెంకటేశ్వర చౌదరి అదనంగా 21. రుక్మాంగదకథ 22. చూర్ణికలు చెప్పినాడు. నల్లూరు రామారావు అదనంగా 23. దుర్గిపురీశశతకం 24. విచిత్రశతకం 25. శ్రీగోపాలశతకం చెప్పినాడు.

సుబ్బదాసుగారి సాహిత్యం భక్తి జ్ఞాన యోగముల త్రివేణీ సంగమం. సమకాలీనులైన సత్తెనపల్లి ఫీరోజీమహర్షి (1829-1889), చెన్నపట్నం పోకల శేషాచలం వంటి ప్రముఖులా సంగమంలో అవగాహనం చేసినారు. సుబ్బదాసుగారి చేతివ్రాత ముత్యాలకోవ. ఆయన తాళపత్రగ్రంధాలింకా భద్రంగా ఉన్నవి. ఆయన కీర్తనలు వివిధరాగతాళాల్లో ఉన్నవి. ఆయన చక్కని బయకారి, గొప్ప వాగ్గేయకారుల కోవకు చెందినవారు. ఆయన తానెట్లు మైమరచి కీర్తనలు పాడుకున్నారో ఆయనభక్తు లీనాటికీ ఆపాటలు పాడుతూ హృదయ క్షేత్రాల్లో భక్తిసస్యాలు, ముక్తిఫలాలు పండించుకుంటున్నారు. ఆయన భక్తియోగశక్తులు ఆయన కృతులకు కూడ పట్టినవి. ఆపాటలు పద్యాలు పాడుకునేవారు ఇష్టకామ్యార్థాలు పొందుతున్నారు. భగవద్భక్తులున్నంతకాలం ఆయన సాహిత్యం నిలుస్తుంది. సుబ్బదాసుగారి మునిమనుమడు సుబ్బయ్యకూడ పరమభాగవతుడనీ గొప్పజ్ఞాని అనీ ఆయన భార్య 1956 నాటికి సజీవ అనీ పంగులూరివారి ఉవాచ. సుబ్బదాసుగారి గోపాల సంకీర్తనం సుప్రసిద్ధ నారాయణ శతకం రామరామశతకం ధోరణిలో సాగిన కృతి. దాని ఆరంభచరణాలు

"శ్రీరుక్మిణీ నాయకా - అవ్యయాశ్రితలోక ఫలదాయకా
నేరముల్ క్షమియింపవే - దుర్గిపురి నిలయ శ్రీగోపాలకా
తాపత్రిశిఖిజొచ్చితీ - సంసార కూపంబులో జిక్కితీ
చేపట్టి నను బ్రోవవే - దుర్గిపురి శ్రీకృష్ణ గోపాలకా"

ఆధారాలు : 1. ఆంధ్రభక్త విజయము - పంగులూరి వీరరాఘవుడు, అప్పికట్ల 1957
2. జ్ఞానాగి... ...డివి సూర్యకుమారి - హైదరాబాదు - 1995

*



# మరోసారి సాయికథలు

- అక్కిరాజు రమాపతిరావు

## సర్వజ్ఞః, పరమాత్మాచ

దాసుగణు మహరాజ్ గొప్ప హరికథకుడు.

మహారాష్ట్రంలో ఆయనకెంతో పేరుంది.

ఆయన సంకీర్తన పద్ధతి ఎంతో విలక్షణమైంది.

శిరిడిసాయినాథుడికి దాసుగణు ఎంతో ప్రేమపాత్రుడు.

శిరిడిలో శ్రీరామనవమి ఉత్సవం ప్రారంభించిన తర్వాత ఆ రోజు దాసుగణు హరికథ ఏర్పాటు తప్పనిసరి! అట్లా ఆయన శిరిడి సాయినాథుడి సమక్షంలో ఏ పదిహేనుసంవత్సరాలో హరికథాగానం చేసి తరించాడు.

దాసుగణు మహరాజు శ్రీసాయినాథుణ్ణి కీర్తిస్తూ 'స్తవనమంజరి' అనే కీర్తన మాలవెలువరించాడు. సాయి భక్తులందరికీ ఈ స్తవన మంజరి శిరోధార్యం. మంజరి అంటే పూలగుత్తి అని కదా! వాళ్ళా పాటలను కళ్ళకద్దుకొనేవారు.

దాసుగణు హరికథ చెప్పిన చోటనల్లా సాయీశ్వరుడిని కీర్తించేవాడు. ఆయన దివ్యమహిమను తనివి తీరా గానం చేసేవాడు. అందువల్ల సాయిబాబాను గూర్చి అంతకుముందు వినని వాళ్ళు కూడా ఆసాయి ప్రభువు పాదాలు గుండెలకు హత్తుకోవాలని ఆరాటపడేవాళ్ళు. తహతహ చెందే వాళ్ళు. ఆయనకు మొక్కుకునే వాళ్ళు.

దాసుగణు మహరాజు హరికథల వల్ల సాయి నాథుడి దివ్య కీర్తి, అద్భుత మహిమ అహమ్మద్ నగర్ జిల్లా నుంచి కొంకణ ప్రాంతం వరకూ పాకింది. థాణేలో కాపీనేశ్వరాలయం చాలా ప్రసిద్ధమైన దేవాలయం. ఆ ఆలయంలో ఒకసారి దాసుగణుమహరాజు హరికథ చెపుతున్నారు. అక్కడి శ్రోతలలో చోల్కర్ అనే పేద యువకుడున్నాడు. దాసుగణు మహారాజు సాయి మహిమను పరమమనోహరంగా, కర్ణ రసాయనంగా గానం చేస్తున్నాడు. చోల్కర్ థాణే సివిల్ కోర్టులో గుమాస్తా. అతడి ఉద్యోగం ఇంకా ఖాయంకాలేదు. తాత్కాలికమైన స్థానంలో ఉన్నాడు. అతడి కుటుంబం పెద్దది. అతడు నిరుపేద. సాయి అద్భుత దివ్య లీలావతారకరుణా మహిమను విని చోల్కర్ గుండె కరిగి కన్నీరై బయటకు వచ్చింది. అతడు మనసులోనే సాయినాథుడికిలా మొక్కుకున్నాడు. 'ఓ స్వామీ నేను పేదవాడిని. నిన్ను

అర్చించుకోవడం నాకు సాధ్యమా?! నిన్ను దర్శించుకోవడమంత అదృష్టమా! కలవాడు కొండలు దాటవచ్చు కాని పేదవాడు ఇంటి గడపకూడా దాటలేడు కదా! అయినా నీ అనుగ్రహం అర్థిస్తున్నాను. 'సర్కారు వారి పరీక్షలో కృతార్థుణ్ణై, నేను చేస్తున్న ఉద్యోగం ఖాయమై, నేను దిగులూ చింతా మాని ఊపిరి పీల్చుకోగలిగితే శిరిడీ వచ్చి నీ దర్శనం చేసుకుంటాను. నీ పాదాలపై నాఫాలం అద్దుకుంటాను. నీ పాదధూళి గుండెలకు హత్తుకుంటాను. నీ పేరు మీద కలకండ పంచి పెట్టి సంతోషపడతాను'. అని మొక్కుకున్నాడు చోల్కరు.

అతడు పరీక్ష పాసైనాడు. అతడికి ఉద్యోగమూ ఖాయమైంది.

అయితే అతడు తన మొక్కు మరిచి పోలేదు. ఆపదమొక్కులూ సంపదమరపులూ కాదు అతడి వాలకం. అతడు సాయిబాబా పాదాలపైన గుండెల్లో గురినిలుపుకున్నవాడు. శిరిడీ వెళ్ళాలి, శిరిడీ వెళ్ళాలి. సాయిబాబాని దర్శించుకోవాలి, ఎలా ఎలా అని అతడి మనసు సందడి చేయసాగింది. గుండెకొట్టుకలాడింది. అయితే తన సంసారం పెద్దది. నెల జీతం తిండీ బట్టాకే సరిపోదు. ప్రయాణపు ఖర్చు కావాలి కదా! కలకండ మొక్కు చెల్లించాలి కదా! శత కోటి దరిద్రాలకు అనంత కోటి ఉపాయాలన్నాడట వెనకటికెవడో!

గావంచాకు సరిపోకపోతే గోచీగా ఉపయోగించుకోవాలి.

ఎట్లానో కొంత పైకం మిగల్చాలి? శిరిడీ వెళ్ళి రావాలి. కాదు వెళ్ళి తీరాలి. అనుకున్నాడు చోల్కర్. టీలో చక్కెర వేసుకోవడం మానేస్తే సరి. ఆ డబ్బు మిగులుతుంది. మూడునెలలో నాలుగు నెలలో ఇలా చక్కెర లేని తేనీరు సేవిస్తే పదో పరకో మిగిల్చి శిరిడీ ప్రయాణం చేయవచ్చు. తన పథకం అమలు చేశాడు చోల్కర్. నాలుగు రాళ్ళు వెనకేసుకున్నాడు. బోలో-సాయినాధ్ మహారాజ్ కు జై - అని బయలుదేరాడు. శిరిడీ చేరాడు. బాబాపాదాలపై తన నుదురుమోపాడు. ఒక టెంకాయను ఎంతో భక్తితో సమర్పించుకున్నాడు బాబాకు. మసీదులో చేరిన భక్తులకు ఆనందంగా కలకండ పంచిపెట్టాడు. తనకిక ఏ కోరికలూ లేవు అనుకున్నాడు. తన జీవితం ఆవాళధన్యమైంది అని భావించాడు. 'బాబా! ఇవాళ నాకెంత ఆనందంగా ఉందో చెప్పలేను. నాకోరిక తీరింది. ఇన్నాళ్ళకు నీ దర్శనమైంది' అని పొంగిపోయినాడు చోల్కర్. తన అచ్చ స్వచ్ఛ అంతరంగాన్ని బాబాముందు కుమ్మరించాడు.

శిరిడీలోనే నివసించే బాపూ సాహెబ్ జోగ్‌తో దూరపు పరిచయం ఏదో ఉంది చోల్కర్‌కు. అందువల్ల శిరిడీరాగానే బాపూసాహెబ్ జోగ్ అతిథిగా ఆయన ఇంటికి చేరాడు చోల్కర్. జోగ్‌గారితో ఆత్రుతతో ద్వారకామాయిలో అడుగుపెట్టాడు. బాబా ప్రసన్నమధురమైన చూపులతో చోల్కర్‌ను కటాక్షించారు. బసకు వెళ్ళటానికి చోల్కర్ శెలవు అర్థించగా బాపూ

సాహెబ్ జోగ్‌ను తన దగ్గరకు పిలిచి 'ఏమయ్యా నీ అతిథికి ఇవాళా రేపూ పుష్కలంగా చక్కెర వేసి టీ ఇవ్వు' అన్నాడు బాబా.

ఈ మాటల అర్ధం జోగ్ గారికి బోధపడలేదు. చోల్కార్ కళ్ళనిండా ఆనంద బాష్పాలు. అవి కృతజ్ఞతాహారమౌక్తికాలు. మళ్ళీ బాబాపాదాలపై వాలి పోయాడు చోల్కర్. అర్ధంగాక తెల్లబోయిచూశాడు బాపూసాహెబ్‌జోగ్.

నా భక్తుల్ని నేను సప్త సముద్రాల ఆవల ఉన్నా కనిపెట్టి ఉంటాను. నన్ను నమ్మిన వారి వెన్నంటి ఉంటాను. నాకు అసాధ్యమంటూ ఏమీలేదు. నీ సమాచారమంతా నేను గమనిస్తూనే ఉన్నాను అని చోల్కర్‌కు భరోసా ఇచ్చినట్టైంది బాబా దరహాసపూరిత వాక్కు. బాపూ సాహెబ్‌జోగ్ దారిలో అర్ధం కానట్లు చోల్కర్ వైపు చూడగా అతడు జరిగిన సంగతి యావత్తూ పూసగుచ్చినట్లు చెప్పాడు. రాణే కోపీనేశ్వరాలయంలో దాసుగణు మహరాజ్ హరికధకు హాజరు కావడం మొదలు పెట్టి కలకండ మొక్కు తీర్చుకోవడం వరకు విన్పించాడు చోల్కార్. ఇన్నాళ్ళు వగరుతేనీరు తాగాడు ఈ అమాయకుడు, ఇక ఇతడి టీ ఇబ్బడిముబ్బడి తీపి చేయాలి అని అనుకున్నాడు బాబా.

అందుకే బాపూసాహెబ్ జోగ్‌తో సాంకేతికంగా ఆమాట చెప్పారు బాబా. "కలడందురు దీనులయెడ"........తనను నమ్మి చెయిచాపిన అందరి యెడ ఆయన సాయినాధుడు. ఆయన సర్వజ్ఞుడు. ఆయున పరమాత్మ.

* * * * * *

"బాబా తాను సర్వాంతర్యామినని చెప్పెడివారు. అన్నిటి యందు అనగా భూమి, గాలి, దేశము, ప్రపంచము, వెలుతురు, స్వర్గములందు వారు గలరు. అతడు అనంతుడు. బాబా మూడున్నరమూరల శరీరమని యనుకున్నవారికి పాఠము చెప్పుటకే వారు ఈ రూపముతోనవతారమెత్తిరి. ఎవరైన సర్వస్యశరణాగతి చేసి రాత్రింబవళ్ళు వారిని ధ్యానించినచో చక్కెర తీపి, కెరటములు సముద్రము, కన్నుకాంతి కలిసి యున్నట్లే అనుభవము పొందెదరు' ' -పుట 165 -శ్రీ సాయిబాబా జీవిత చరిత్రము. -శ్రీ పత్రి నారాయణరావు, 1991 ముద్రణము.

"దృష్టికి - కన్పించునదంతయు భగవత్ స్వరూపమని భావించుటయే యధార్థమగు భక్తి, యోగమని తెలిసుకొనుము" -మెహర్‌బాబా.

# అహం వృత్తి

-శ్రీ జిడ్డు 'నాన్న'గారు

ప్రియమైన ఆత్మబంధువుల్లారా,

శరీరం పుట్టినరోజు పుట్టినరోజు కాదు, శరీరం మరణించిన రోజు మరణించిన రోజు కాదు. మనందరము ఏమనుకొంటున్నాము అంటే శరీరం పుట్టినపుడు మనం పుట్టాము అనుకొంటున్నాము. అది నిజం కాదు అని ఆచార్యులవారు చెపుతున్నారు. దేహం పుట్టటం ఒక తలంపు, దేహం మరణించటం ఒక తలంపు. ఇవి కేవలము స్వప్న సమానమే. నిద్రలో స్వప్నాలు వస్తూ ఉంటాయి. ఆ స్వప్నం ఎంత అసత్యమో ఈ జీవితం కూడా అంతే అసత్యము. అది పొట్టిగా ఉంటుంది, ఒక గంటో రెండు గంటలో ఉంటుంది. జీవితం 60 సం.లో, 70 సం.లో ఉంటుంది కాని అది ఎంత అసత్యమో ఇది కూడా అంతే అసత్యం. శరీరం జన్మించినపుడు నీవు జన్మించలేదు అంటున్నారు, మరి ఎప్పుడు జన్మించాము? నీకు వ్యక్తిభావన ఎప్పుడైతే కలిగిందో అంటే మిధ్యానేను ఎప్పుడైతే పుట్టిందోఅప్పుడు మనం జన్మించాము. శరీరం మరణించినపుడు మనం మరణించము. వ్యక్తిభావన ఎప్పుడైతే నశించిందో అప్పుడు మనం మరణిస్తాము. శరీరం పుట్టుక కాదు, శరీరం మరణం మరణం కాదు. రెండూ తలంపులే. వ్యక్తిభావన ఎప్పుడైతే పుట్టిందో అప్పుడు నీవు పుట్టావు. వ్యక్తిభావన ఎప్పుడైతే నశించిందో అప్పుడు నీకు బ్రహ్మానుభవం కలుగుతుంది. వ్యక్తిభావన నశించాలంటే వ్యక్తిభావన విజృంభించకుండా ఉండే పనులు చేయాలి. పూజ, జపం చేసినంత మాత్రంచేత వ్యక్తిభావన నశించదు. పూజ, జపం, ధ్యానం ఇవి అన్నీ మనస్సు అణగటానికి. వ్యక్తిభావన పెరిగే మాటలకు, చేతలకు, ఆలోచనలకు మనం దూరంగా ఉండాలి. రూపదృష్టి, నామదృష్టి లేకుండా పని చేస్తే వ్యక్తిభావన నశిస్తుంది.

నీవు ఏ వస్తువును పొందటం కోసం ప్రయత్నం చేస్తున్నావో అది ఎక్కడో దూరాన లేదు. నీహృదయంలోనే ఉంది. నీవు సాధన చేసి ఏదో ఒక మార్గములో ప్రయాణించి దేహగతమైన నేనును తొలగించుకొంటే ఆవస్తువు నీకు వ్యక్తమవుతుంది. పూర్వజన్మలో నీవు ఏమార్గములో ప్రయాణం చేసావో అది ఇప్పుడు నీకు సహజంగాను, తేలికగాను అనిపిస్తుంది. అహంకారముతో సహవాసం విడిచిపెట్టమని చెపుతున్నారు. గాఢనిద్రలో మానవుడు అహంకారముతో సంబంధం లేకుండా ఉంటాడు. జాగ్రదావస్థలోనికి వచ్చిన తరువాత వాడి అహంకారము గొడవ తప్పించి ఇంకేమీ వాడికి అక్కరలేదు. మనం ఎంతో కష్టపడి కృషి చేస్తే భక్తి వస్తుంది. కాని అది అంత తేలికగా వచ్చే సామాగ్రి కాదు. దీనికి గురువు అనుగ్రహం అవసరము. వైరాగ్యం లేకపోతే భక్తిరాదు, భక్తి లేకపోతే జ్ఞానం లేదు. జ్ఞానం లేకపోతే మోక్షం లేదు అని భగవంతుడు చెప్పాడు.

నేను ఇంతసేపు పూజ చేసాను, అంతసేపు జపం చేసాను, యాత్రలకు తిరిగాను అని అనుకొంటున్నావు. ఆపూజ చేసిన నేను ఎవడు? జపం చేసిన నేనుఎవడు? యాత్రలు చేసిన

నేను ఎవడు? వాడిని తీసి ఒక ప్రక్కన పెడితేనేగాని నీకు మోక్షం రాదు అన్నారు రమణాచార్యులు. ఎంతసేపు ఈ గొడవలు ఏమిటి? నీవు నిజంగా భక్తుడవు అయితే అరగంట పూజ చేసాను, గంట జపం చేసాను, యాత్రలకు వెళ్ళాను ఈ గొడవలు కాదు. వీటి అన్నింటిలోనూ నేను ఉన్నాడు. ఆ నేనును తీసివేస్తే గాని నీకు మోక్షం కలుగదు. ఆ నేనుతో సహవాసం ఉన్నంతకాలము పుడుతూ ఉండాలి, మరణిస్తూ ఉండాలి, మరల తిరిగి పుడుతూ ఉండాలి. ఈ జననమరణ ప్రవాహము నుండి విడుదల అయ్యే అవకాశం లేదు. తన హృదయంలో ఉన్న బ్రహ్మము ఎవడికైతే ప్రత్యక్షంగా అనుభవం లోనికి వచ్చిందో వాడు సద్గురువు. ఎవడైతే తన చూపుద్వారా, మాటద్వారా, చేతద్వారా, మౌనం ద్వారా ఇతరులను అనుగ్రహిస్తున్నాడో వాడు సద్గురువు.

మన మనస్సు భగవంతుడు చెప్పిన మాటలు వినదు. విన్నట్లు నటిస్తుంది. అయితే మనం ఎవరు చెప్పినట్లు వింటున్నాము అంటే అహంకారము చెప్పిట్లుగా వింటున్నాము. జ్ఞాని యొక్క మనస్సు వాడు చెప్పినట్లుగా వింటుంది. వాడు కదలమంటే కదులుతుంది లేనిచో స్థిరంగా ఉంటుంది. కారణం ఏమిటి అంటే తాను ఎవడో తనకు తెలియబడింది కాబట్టి బ్రహ్మానుభవం కలిగింది కాబట్టి వాడి మనస్సు వాడు చెప్పినట్లుగా వింటుంది, అంటే సేవకుడిలాగ పని చేస్తుంది. ఇప్పుడు మన మనస్సు మన మీద పెత్తనం చేస్తుంది. మన మనస్సు మనకు యజమానిగా ఉంది, మనం నౌకర్లుగా ఉన్నాము. జ్ఞానం వచ్చిన తరువాత మనస్సు నౌకరుగా మనము యజమానిగా ఉంటాము. ఏ శరీరమును, మనస్సును, బుద్ధిని, తెలివిని నీవు అనుకొంటున్నావో అవి అన్నీకూడా జడవస్తువులే. నీ లోపల ఉన్న చైతన్యము వలన ఇవి అన్నీ సజీవంగా ఉన్నట్లు నీకు అనిపిస్తోంది. వీటిలో నుండి విడివడితే నీవు ఎవరో నీకు తెలుస్తుంది. దేవుడు ఉన్నాడా, లేడా అని విచారణ చేసే బదులు నీ అహంవృత్తిని తొలగించుకొంటే వెంటనే నీ లోపల ఉన్న సద్వస్తువు నీకు వ్యక్తమవుతుంది.

నువ్వు మనస్సువు కాదు, నువ్వు అహంకారము కాదు, నువ్వు బుద్ధివి కాదు అని శాస్త్రము చెపుతోంది, భగవంతుడు చెపుతున్నాడు. పరమేశ్వరుడు చెపుతున్నప్పటికి నీవు ఏదైతే కాదో దానిని పట్టుకొని వ్రేలాడుతున్నావు కాని దానిని విడిచిపెట్టటానికి ప్రయత్నం చేయటం లేదు. సాధన చేసే వారు కూడా అహంకారమును విడిచిపెట్టకుండా అహంకారముతో భగవంతుని తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. అహంకారం నశిస్తేగాని నీ హృదయంలో వున్న భగవంతుడు నీకు వ్యక్తం కాడు. శరీరం మరణించేలోపు నీహృదయంలో ఉన్న సత్యమును అనుభవంలోనికి తెచ్చుకొంటే సత్యమునకు మరణం లేదు కాబట్టి శరీరం మరణించేటప్పుడు నేను మరణిస్తున్నాను అనే భావన గాని, తలంపుగాని నీకు రాదు. గుణబద్ధుడు గుణాతీతుడితో స్నేహం చేయగా ఇలా స్నేహం చేయగా చేయగా వీడు కూడా గుణాతీతుడు అవుతాడు. మనలో ఉన్న పునర్జన్మకు కారణమైన హేతువులు నశించటానికి సత్పురుషుల సహవాసం అవసరం. నీఅంతట నీవు సాధన చేసి వాటిని తొలగించుకొంటే సరే లేకపోతే సజ్జన సాంగత్యం వలన నీలో ఉన్న పునర్జన్మ హేతువులు నశిస్తాయి. (సశేషం)

# జిల్లా వార్తలు

- పులిపాటి సుబ్బారావు

ఐక్యతా దినోత్సవ వేడుకలు"

శ్రీ.శ్రీ.శ్రీ. విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ గారి 53వ జన్మదినోత్సవ వేడుకలు మార్చి 3, 4, 5 తేదీలలో గుంటూరులోగల విశ్వమందిరములో శ్రీ ఆకుల కోటేశ్వరరావు, కామేశ్వరి, పర్యవేక్షణలో విశ్వకుటుంబ సభ్యులు అత్యంత వైభవంగా జరుపుకున్నారు.

3వ తేదీ ఉదయం 6గం॥లకు వేద ప్రవచనము, పూజాకార్యక్రమములు విశ్వకళ్యాణానికి శాంతికి హోమములు అభిషేకములు జరిగినవి. రాత్రి 7 గం॥లకు శ్రీ కంచర్ల పాండురంగారావు రచించిన "రామదాసు" గ్రంధాన్ని విశ్వగురు పీఠాధిపతులు శ్రీ విశ్వయోగి విశ్వంజీ ఆవిష్కరించారు. శ్రీనాథ పీఠం అధ్యక్షులు డా॥ ప్రసాదరాయ కులపతి సభకు అధ్యక్షత వహించగా, ప్రముఖ న్యాయవాది. అధ్యక్షులు, హిందూ కళాశాల శ్రీ మాధవ పెద్ది రాధాకృష్ణమూర్తి సభను ప్రారంభించారు. శ్రీయుతులు విద్యాసాగర శర్మ, వంగల వెంకటాచలపతిరావు, ఏలూరిపాటి అనంతరామయ్య, డా॥ జంధ్యాల జయకృష్ణ బాపుజీ, లేబరు కోర్టు న్యాయమూర్తి శ్రీ లంకా అప్పారావు, పి.యస్.ఆర్. అంజనేయ ప్రసాద్ తదితరులు మాట్లాడుతూ రామదాసుకు సంబంధించిన అనేక విషయాలను పరిశీలించి, పరిశోధించి ఈ గ్రంథం ద్వారా రచయిత ఆంధ్రులకు అందించారని కొనియాడారు.

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సందేశమిస్తూ, మహాత్ములకు దివ్యత్వం చూపడంలో తారతమ్యాలు ఉండవని అన్నారు. చక్రవర్తి సొమ్ముతో ఆలయ నిర్మాణం, ఆభరణాలు ఏర్పరచినందుకు శ్రీరాముడు తానీషాకు కనిపించాడు కాని, భక్తుడైన రామదాసుకు కనిపించలేదని చెప్పారు. శ్రీరాముడు తానీషాకు దర్శనమిస్తే, రామదాసుకు తన దివ్యమైన ఆశీస్సులను ఇచ్చారని అన్నారు. ప్రతి మనిషి మానవత్వాన్ని పునాదిగా చేసుకొని, సనాతన ధర్మాన్ని ఆచరిస్తూ సంస్కారవంతులుగా జీవించాలని ఉద్బోధించారు. దేశంలో నేటి క్లిష్టపరిస్థితులను సరిదిద్దుటకు అన్ని వర్గాల మేధావులు సమైక్యం కావలసిన అవసరము ఎంతైనా వుందని చెప్పారు. మనిషి జీవితంలో కష్టాలను, సుఖాలను సమానంగా ఓర్చుకున్నప్పుడే ప్రశాంతత కలుగుతుందని అన్నారు. మనిషి పతనానికి అహంకారము మూల కారణమని, దాన్ని విడనాడాలని ఉద్బోధించారు.

రాత్రి 9 గం॥ ప్రముఖ కదకురాలు శ్రీమతి మామిళ్ళ సరస్వతి ఆలిండియా రేడియో ఆర్టిస్ట్, తెనాలి వారిచే 'లవకుశ' హరి కథాగానం చేసి శ్రోతల మన్ననలను పొందారు.

**4-3-97** (మంగళవారం) **11** గం॥ సేవాదళ్ సభ్యులు, కార్యకర్తల సమ్మేళనం జరిగినది. మాన్యశ్రీ జస్టిస్ రంగనాథమిశ్రా, మాజీ సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తి మరియు చైర్మన్ జాతీయ మానవ హక్కుల కమీషనర్ ముఖ్య అతిథిగా విచ్చేసి 'విశ్వశాంతి

సేవాదళ్ ను లాంఛనప్రాయంగా 12-33ని॥కు సభికుల హర్షధ్వానాల మధ్య ప్రారంభించినట్లుగా ప్రకటించారు. శ్రీ మాధవ పెద్ది రాధాకృష్ణమూర్తి సభకు అధ్యక్షత వహించారు. ఈసభలో మార్నింగ్ స్టార్ పబ్లిక్‌స్కూల్, విశ్వవాణి రెసిడెన్షియల్ కాలేజి విద్యార్థినీ, విద్యార్థినులు 400 మంది పాల్గొన్నారు. విశ్వకుటుంబ సభ్యులు, విద్యార్థినీ, విద్యార్థినులు సేవాదళ్‌లో సభ్యులుగా చేరినట్లు శ్రీ రంగనాధ మిశ్రా సమక్షంలో ప్రమాణం చేసినారు. శ్రీ విశ్వయోగి విశ్వంజీ ఆశయ సిద్ధి కొరకు తమ సేవలను నిస్వార్ధంగా అందిస్తామని పలికారు.

ఈ సభలో టెలికాం జనరల్ మేనేజరు శ్రీ యం రామచంద్రన్, లేబరుకోర్టు జడ్జి శ్రీ దత్తాత్రేయులు, మాజీ శాసన సభ్యులు శ్రీ లింగంశెట్టి ఈశ్వరరావు, డా॥ దత్తాత్రేయ శాస్త్రి, డా॥ మీరాబాయి, అప్పారావు, రామమోహనరావు, కె.వి. శేషగిరిరావు, శ్రీమతి కోటేశ్వరమ్మ ప్రభుతులు ప్రసంగించారు. ప్రముఖ రచయిత్రి శ్రీమతి డా॥ దిట్టకవి శ్యామలాదేవి, పొత్తూరి సుబ్బారావు, న్యాయవాది శ్రీ జి.వి.యల్.యన్. మూర్తి తదితరులు పాల్గొన్నారు.

ఈ సందర్భముగా జస్టిస్ శ్రీ రంగనాధమిశ్రా మాట్లాడుతూ విద్య అనేది పరిపూర్ణ జీవితానుభవం అని అన్నారు. దానికి కుల, మత, వర్గ బేధాలు లేవని అన్నారు. విద్యార్థి దశనుండే జీవనవువిలువలను అలవరచుకోవాలని పిల్లలకు ఉద్బోధించారు. ప్రతి మనిషికి సేవచేయటం సమాజాభివృద్ధికి పునాది అని లన్నారు. సేవఅంటే మనం భూమిపైచేయు భగవంతుని పని అని అన్నారు.

మానవ సేవకు ఆత్మార్పణబుద్ధి, నిస్వార్థమైన త్యాగనిరతి అత్యంత ఆవష్యకములని చెప్పారు. చిన్నవయస్సునుండే దైవం, గురువు, సృష్టి యెడల భక్తిశ్రద్ధలు, క్రమశిక్షణ, ప్రేమతత్వం విద్యార్థులు అలవరచుకొని, ఉత్తమ పౌరులుగా, మేధావులుగా తయారు అయి సమాజానికి సేవలు అందించాలని ఉద్బోధించారు. శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీవివేకానంద స్వామివారి బోధనలు ఉదహరిస్తూ సేవచేయడం, మనుష్యలకే పరిమితం కాకుండా ప్రకృతిలోగల ప్రతిదానికి అనగా చెట్లు, నదులు, కొండలకు కూడా సేవలు అందించాలని కోరారు.

గురువు యెడల సంపూర్ణమైన విశ్వాసం కల్గి ఉండాలని మహాభారతంలో కథను వివరించారు. ఏకలవ్యుడుకు ద్రోణచార్యులు విలువిద్యను నేర్పకపోయినా గురువు యందు విశ్వాసము, భక్తి నిలిపి ద్రోణాచార్యులవారి విగ్రహంముందు విలువిద్యను అభ్యసించి ద్రోణాచార్యులవారి ప్రశంసలను పొందెనని చెప్పారు. క్రమశిక్షణ విద్యార్థులకు ఎంతైనా అవసరమని ఉద్ఘాటిస్తూ, 'ఫణి' అను విద్యార్థి గురువు ఆజ్ఞను శిరసావహించి పంటచేనుకు గండిపడి నీరు పోకుండా అడ్డుపడుకొని పంటను కాపాడాడని చెప్పారు. మరుసటిరోజున గురువు విద్యార్థులందరిని సమావేశపరచి, ఆ విద్యార్థి, విద్యను అభ్యసించడం పూర్తిచేసాడని కొనియాడారు.

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ సందేశమిస్తూ, ప్రతి మనిషి ఎవరో వచ్చిసహాయం అందిస్తారని ఎదురుచూడకుండా ఎవరికాళ్ళమీద వాళ్ళునిలబడాలని చెప్పారు. సేవాదళ్

సభ్యులు ప్రజల్లో అవసరాలను గుర్తించి, బీదలకు, సమాజంలో అట్టడుగువారిని గుర్తించి నిజంగా సహాయం అవసరమైనవారిని తెలుసుకొని వారికి సేవలను నిస్వార్థంగా అందించాలని కోరారు. సభ్యులు క్రమశిక్షణ, అంకితభావం, ప్రేమతో మెలగాలని ఉద్బోధించారు. వారు మాట్లాడుతూ "Self service is the best service" - అని చెప్పారు. "Service All - Love All" అనేది వారి ధ్యేయమని చెప్పారు. విశ్వశాంతి సేవాదళ్ లో చేరిన సభ్యులకు వారి దివ్యమైన ఆశీస్సులను అందజేశారు.

రాత్రి 7గం॥కు డా॥ ప్రసాదరాయ కులపతి గారి ఆధ్వర్యంలో "విశ్వనాథ విజయం' ' (విశ్వనాధ ఊహాసభ) సాహితీరూపకం అత్యంత వైభవముగా నిర్వహించారు. ఇందులో ప్రముఖ కవులు, కవయిత్రిలు, సాహితీవేత్తలు, మన ప్రాచీన కవుల పాత్రలను పోషించి వారి కవితా విశిష్టత ద్వారా శ్రీ విశ్వయోగి విశ్వంజీ ఆశయాలను, విశ్వసమైక్యతను చాటించారు. తొలుత ప్రముఖ పాత్రికేయులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు సభను ప్రారంభించి ప్రసంగించారు. రాత్రి 9గం॥కు ప్రముఖ భాగవతార్ శ్రీ తుర్లపాటి శరభయ్యాచార్య "భక్తమార్కండేయ'' హరికథాగానం చేసి శ్రోతలను భక్తిపరవశులుగా చేశారు.

5-3-97 (బుధవారం) ఉదయం 4గం॥కు భక్తులు నగర సంకీర్తనం జరిపారు. ఉదయం 7గం॥కు వేదపండితులు హోమము నిర్వహించారు. ఉదయం 11గం॥కు శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ జన్మదిన సందర్భంగా డా॥ ప్రసాదరాయ కులపతి గారి అధ్యక్షతన "సమైక్యతా సదస్సు'' జరిగినది. హైకోర్టు న్యాయమూర్తి శ్రీ మోతీలాల్ బి. నాయక్ గారు ముఖ్య అతిధిగా ప్రసంగించారు. వారు మాట్లాడుతూ సమాజంలో తోటి మనిషిని మనిషిగా గుర్తించడమే భగవంతునికి సేవ చేసినట్లు అవుతుందని అన్నారు. ప్రతి వ్యక్తి తన కర్తవ్యాన్ని బాధ్యతాయుతంగా నిర్వహించవలసిన అవసరం ఎంతైనా వుందని అన్నారు. ధర్మాన్ని ఆచరిస్తూ, హృదయంలో మానవత్వాన్ని నిలుపుకొని, మంచితనాన్ని పెంచుతూ జీవనయానం సాగించిననాడు ప్రజల్లో సమైక్యత అదేవస్తుందని చెప్పారు. నేటిసమాజంలో పెరిగి పోతున్న కుళ్ళు, అరాచకాలను రూపుమాపటానికి శ్రీ విశ్వయోగి విశ్వంజీ లాంటి యోగులు, మహాత్ములు కారణజన్ములుగా ఉద్భవించారని అన్నారు. ఆ ప్రేమ తత్వాన్ని ప్రతి ఒక్కరు అలవరచుకొని మీరు చేపట్టిన మహోన్నతమైన ఉద్యమంలో అందరు భాగస్వాములు కావలని పిలుపు ఇచ్చారు.

అధ్యక్షులు, సర్వార్ధ సంక్షేమసమితి, హైదరాబాదు శ్రీ పి.వి. మనోహరరావుగారు మాట్లాడుతూ సమైక్యతానినాదం క్రొత్తదికాదని, మన భారతీయసనాతనధర్మంలో అది, ఆదికాలంనుండి ఉన్నదని చెప్పారు. ఆ ధర్మాన్ని ప్రతి ఒక్కరు చిత్తశుద్ధితో ఆచరించిన ప్రజల్లో మనస్సులు ఏకమై, విశ్వభావన కల్గి శ్రీ విశ్వయోగి విశ్వంజీ ఆశించిన విశ్వ సమైక్యత దానంతట అదే వస్తుందని అన్నారు.

సభలో జస్టిస్ రంగనాధమిశ్రా, మాజీ డి.జి.పి శ్రీ టి. యస్. రావు, ఆదాయపన్ను

రిటైర్డు ఛీఫ్‌కమీషనర్ శ్రీ పి.ఆర్.రావు, సాహితీ వేత్తలు శ్రీ అక్కిరాజు రమాపతిరావు, డా॥ దిట్టకవి శ్యామలాదేవి, శ్రీ కనుమలూరి వెంకట శివయ్య, తిరుమల రామచంద్ర, బ్రిజ్‌గోపాల్‌రుమాని, శ్రీ లింగంశెట్టి ఈశ్వరరావు, దాసరిశేషగిరిరావు, జి.పున్నారావు, వ్యాపారవేత్త ప్రసాద్, శ్రీ విద్యాసాగరశర్మ ప్రసంగించారు.

ఈ సందర్భంగా శ్రీ పి. ఆర్. రావు రచించిన "విశ్వప్రేమైక మూర్తి" గ్రంథాన్ని శ్రీ టి.యస్. రావు, శ్రీమతి పి. యశోధర రచించిన "డివైన్ స్లెండర్" గ్రంథాన్ని జస్టిస్ శ్రీ రంగనాధ మిశ్రా, శ్రీ పి.వి. నరసింహారావు రచించిన "డివైన్ గిఫ్ట్" గ్రంథాన్ని న్యాయమూర్తి శ్రీమోతిలాల్ బి. నాయక్, శ్రీ బి. లక్ష్మీ నరసింహారావు రచించిన "విశ్వకరుణ" గ్రంథాన్ని శ్రీ లింగంశెట్టి ఈశ్వరరావు, శ్రీ శ్రీనివాసరావు రచించిన "విశ్వదత్తవ్రతకల్పం" గ్రంథాన్ని, శ్రీ బ్రిజ్ గోపాల్‌రుమాని ఆవిష్కరించారు. శ్రీయుతులు పి.వి. నరసింహారావు, పి.ఆర్. రావు దంపతులను శ్రీ ఆకులకోటేశ్వరరావు, సతీమణి కామేశ్వరిని పూలమాలతో, నూతన వస్త్రములతో ఘనంగా సత్కరించారు.

శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ వారు దివ్య సందేశమిస్తూ! ఉన్న దివ్యమైన శక్తికి చావు అనేది లేదని అన్నారు. ఉన్నది దైవం ఒక్కడేనని, అది సర్వత్రా వ్యాపించియున్న అనంతమైన శక్తి అని చెప్పారు. ప్రతివ్యక్తి గూడా దైవస్వరూపులేనని అన్నారు. దేశం ప్రశాంతంగా, నీతినిజాయితీలతో ధర్మబద్ధంగా ఉండటానికి ప్రభుత్వశాఖల్లో పరిపాలన, న్యాయ, పోలీసు, రెవెన్యూ శాఖల్లో పనిచేసే ఉద్యోగుల కార్మికుల కృషి ఎంతైనా అవసరము ఉన్నదని అన్నారు. మనిషి శాస్త్రపరంగా, సాంకేతికంగా ఎంతగానో ఎదిగినా ఈ భూమి మీద ప్రశాంతంగా ఎందుకు జీవించలేక పోవటాన్ని ఆయన ప్రశ్నిచారు. మనిషి తన నిజజీవితంలో నటిస్తూ జీవిస్తున్నాడేగాని, నిజంగా జీవించడం లేదని చెప్పారు. ప్రతి మనిషి తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తూ, ప్రేమతో, ఆత్మీయతతో జీవనం గడుపుతూ, తనగృహాన్ని, సమాజాన్ని ప్రశాంతంగా ఉంచుకోవటానికి పాటుపడాలని హితవు పలికినారు. ఈ మనిషికి కృతజ్ఞత చాలా ముఖ్యమని, ఈరోజుల్లో సహాయం పొందిన వ్యక్తి, సహాయం చేసిన వ్యక్తికి కృతజ్ఞత చూపడం లేదని ఆవేదన వ్యక్తం చేశారు.

ఈ మహత్తరమైన విశ్వసమైక్యతా ఉద్యమంలో అన్ని వర్గాల మేధావులు భాగస్వాములు కావాలని, వారి మేధాసంపత్తిని విశ్వశ్రేయస్సుకు ఉపయోగించడమే ఈ ఉద్యమ ముఖ్య ఉద్దేశమని అన్నారు. దీనిలో భాగంగానే , వారి ఆశీస్సులతో అమెరికాలో న్యూ జెర్సి - ఆస్ట్రేలియా లాంటి ఇతర దేశాల్లో "విశ్వయోగి విశ్వంజీ ఫౌండేషన్ ఫర్ యూనివర్సల్ ఇంటిగ్రేషన్ అండ్ పీస్" అనే సంస్థను డా॥ హనుమంతరావు, అండవోలు అధ్యక్షతన స్థాపించి పనిచేస్తున్నాయని చెప్పారు.

వారు "యూనివర్సల్ ఇంటిగ్రేషన్ ట్రస్టు" శాశ్వత అధ్యక్షులుగా శ్రీ జస్టిస్ రంగనాధమిశ్రా, ఛైర్మెన్ మరియు కన్వీనర్‌గా నియమించినట్లు సభికుల హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

మనదేశంలో ఇతరదేశాల్లో గల వివిధ వర్గాలలో ఉన్న మేధావులను భవిష్యత్తులో మెంబర్లుగా నియమించనట్లుగా చెప్పారు.

మధ్యాహ్నం 2గం॥లకు మన భారతదేశ సంస్కృతిని, పురాణ గాథలను ఇతరదేశాల్లో వ్యాపింపజేసిన ప్రముఖ హరికథా భాగవతార్ శ్రీవీరగంధం వెంకట సుబ్బారావు 'గజేంద్రమోక్షం' ' హరికథాగానం వారిదైన శైలిలో ఎంతో శ్రావ్యంగా పాడిశ్రోతల ప్రశంసలను పొందారు.

రాత్రి 7గం॥లకు శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ వారి జన్మదినోత్సవ సభ మాన్యశ్రీ జస్టిస్ రంగనాధమిశ్రా అధ్యక్షతన జరిగినది. డా॥ ప్రసాదదాయ కులపతిగారు సభను ప్రారంభించినారు. ఈ సభలో ప్రత్యేక ఆహ్వానితులుగా విచ్చేసిన డి.ఇ.జి.ఆఫ్ పోలీస్ హైదరాబాద్ శ్రీ యస్.కె. జయచంద్ర మాట్లాడుతూ సృష్టిలో వ్యాపింపచేసే లక్షణాలు, స్వరూపం గలవాడు విశ్వరూపుడని అన్నారు. నేటి సమాజంలో అనైక్యత కొనసాగుతోందని, సమాజాభివృద్ధికి అందరు కలిసి కృషి చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని చెప్పారు. ప్రేమ తత్వానికి ప్రతిరూపంగా నిలచిన శ్రీ విశ్వయోగి విశ్వంజీ ప్రేమతత్వం విశ్వవ్యాప్తం కాబోతోందని అన్నారు. మాజీ గుంటూరు జిల్లాపరిషత్ చైర్మెన్ శ్రీ రాయపాటి శ్రీనివాస్, యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీయల్. అప్పిరెడ్డి స్వామీజీకి 53 కె.జి.ల బరువు గల కేకును అందచేశారు. జస్టిస్ రంగనాధమిశ్రా, జస్టిస్ మోతిలాల్ నాయక్, శ్రీ పి.వి. మనోహరరావు, శ్రీ ఆకుల కోటేశ్వరరావు, సతీమణి కామేశ్వరీ కేకును కట్ చేసి భక్తులకు ప్రసాదంగా పంచిపెట్టారు. తొలుత శ్రీ మాధవపెద్ది రాధాకృష్ణమూర్తిగారు స్వాగతం పలికినారు. మార్నింగ్ స్టార్ పబ్లిక్ స్కూల్ విద్యార్థినులు సమర్పించిన సంగీత, నృత్య ప్రదర్శనలు ఆహూతులకు మనోఆహ్లాదాన్ని కలిగించినాయి.

ఈ సందర్భంగా మాన్యశ్రీ జస్టిస్ రంగనాధ మిశ్రా మాట్లాడుతూ గుంటూరు పట్టణం ఆధ్యాత్మికంగా, సాహిత్యానికి, కళలకు, సంస్కృతికి పేరు ప్రఖ్యాతులు గల కేంద్రమని అన్నారు. అట్టిచోట శక్తి సంపన్నులైన శ్రీవిశ్వయోగి విశ్వంజీ మహారాజ్ మనలో ఒకరిగా ఉంటూ సమాజ ఉద్ధరణకు చేస్తున్న అచంచలమైన కృషిని అభినందిస్తూ అది మన అందరి అదృష్టంగా భావిస్తున్నానని అన్నారు. వారి 53వ జన్మదినోత్సవ వేడుకను కనులపండుగగా చేసుకుంటూ, ఈరోజు విశ్వసమైక్యతా దినంగా పాటించి మన అందరము సంతోషాన్ని పంచుకుంటున్నామని చెప్పారు. అన్ని మతాలు బోధనలు, సారాంశం ఒక్కటేనని, ఆదివ్యత్వాన్ని, ప్రేమతత్వాన్ని మనలో పెంచుకొని, పంచుకొని, సమైక్యంగా, మతసామరస్యంతో సహా జీవనం గడపాలని కోరారు. శ్రీ విశ్వంజీ ఆశయాలను మన అందరం ఆచరిస్తూ, వారు చేపట్టి చేస్తున్న మహోద్యమంలో అందరు భాగస్వాములై, ఈ ఉద్యమాన్ని విశ్వవ్యాప్తంచేయడానికి సన్నద్ధులు కావాలని కోరారు. ప్రతివ్యక్తి అకుంఠిత దీక్షతో, నమ్మకంతో పనులు చేస్తే విజయం తప్పక సిద్ధిస్తుందని చెపుతూ ప్రహ్లాదుని ... ఆదర్శంగా తీసుకోవాలని కోరారు. మన భారతావనిలో ఎందరో మహనీయులు, యోగులు, మహర్షులు జన్మించారని వారి అందరి ఆశయం విశ్వశ్రేయస్సేనని చెప్పారు. అనేక దేశాల్లో గూడా శ్రీ విశ్వంజీ 53 వ

జన్మదినోత్సవవేడుకలు విశ్వకుటుంబ సభ్యులు జరుపుకుంటున్నారని తెలిపారు. శ్రీ. విశ్వంజీ పిలుపునిస్తే తాను ఎంతదూరంలో ఉన్న ఉద్యమంలో పాలుపంచుకోవడానికి వెంటనే వస్తానని చెప్పారు.

శ్రీ.శ్రీ.శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ వారి దివ్యమైన జన్మదిన సందేశమిస్తూ వ్యక్తి అంటే శరీరము కాదని, ఆశరీరంలో దాగిఉన్న 'శక్తే' వ్యక్తి అని చెప్పారు. ప్రజల్లో సమైక్యత రావాలంటే అందరి భావాలు, మనస్సులు ఒక్కటిగా చేసుకొని మానవత్వాన్ని పెంచుకొని, హృదయం నిండా ప్రేమ కల్గి ఉండాలని ఉద్బోదించారు. ప్రజల్లో సంస్కరణ తీసుకువస్తే సమైక్యత వస్తుందిగాని, సమానత్వం రాదని చెప్పారు. ఎందుకంటే ఈ సృష్టిలోనే అనేక అంశాలలో సమానత్వంలేదని చెప్పారు. నేడు వాతావరణం కాలుష్య ప్రభావంవల్ల మంచి మనుష్యులయొక్క మనస్సులు గూడా కలుషితమై, చెడుగా మారిపోయి అశాంతికి, హింసామార్గానికి దారి తీస్తోందని ఆవేదన వ్యక్తం చేశారు. మంచిక్రమశిక్షణ, వాతావరణం గల కుటుంబ వ్యవస్థను స్థాపించుకొని ప్రశాంతజీవన యానం గడపాలని హితవు పలికారు. గురువు తమ ఆశీస్సులతో, శిష్యులను పరిపూర్ణ మానవులుగా తీర్చి దిద్ది సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడే శక్తిమంతులైన వ్యక్తులుగా తయారు చేస్తారని చెప్పారు. ప్రతి ఒక్కరికి వారిదివ్యమైన ఆశీస్సులను అందజేశారు.

మూడు రోజులపాటు జరిగిన ఈ జన్మదినోత్సవ వేడుకలు కనులపండువుగా ముగిసినాయి.

*With Best Compliments from*

**M/s. SPECTRA MOTORS LTD.**

PLOT No. 8, Begumpet Road, (Opp. I.B.P. Petrol Pumps)
Hyderabad - 500 016. (A.P.)

*Distributors for A.P.*

**PREMIER AUTOMOBILES LTD.**

**BOMBAY**

Tel. No. : 844034/815017

# నవవిధభక్తులు

-"కళాతపస్వి" కొణికి సత్యనారాయణరావు

ఈ ప్రపంచమందు జన్మించిన ప్రతిమానవుడు, సుఖవంతమైన, ఆనందమయమైన జీవితం గడపాలనికోరుతాడు. సుఖజీవనం గడపడానికి మానవులము ఎన్నోపాట్లు పడతాము. ధనకనక వస్తువాహనాలను, ఎంతో శ్రమకోర్చి, సంపాదించుకొంటాము. వాటి ద్వారా సుఖాన్ని పొందాలని కృషిసాగిస్తాం. దారాపుత్రాదుల వల్ల గూడా ఆనందాన్ని పొందుటకు ప్రయత్నం చేస్తాం. కాని అనుభవం మీద తెలుసుకొనే దేమిటంటే, వీటివలన, లభించు ఆనందము తాత్కాలికమే. శాశ్వతానందమెన్నటికీ కాజాలదు. ఇంద్రియములచే అనుభవించు ఆనందము, అనుభవించుకొలదీ, కోర్కెలు వృద్ధియై చివరకు దుఃఖమయమగునని, ప్రతివాడున్నూ జీవితానుభవమువల్ల తెలిసికొను చున్నాడు. ఇది నిర్వివాదాంశము. కాబట్టి శాశ్వతానందము పొందుటెట్లు యనుప్రశ్న ఉదయించుచున్నది. అట్టి శాశ్వతానందము పొందుమార్గము, దైవారాధనయే.

సమస్తజీవరాసులలో ఉత్తమజన్మమానవజన్మ. అట్టి మానవజన్మలభించిన తర్వాత గూడా, యితర జీవరాసులైన పశు పక్ష్యాదులవలె, కాలమునంతయు, ఆహార, నిద్ర భయ, మైధునాదులతో వృధాజేసినచో, మానవజన్మకు సార్ధకత ఎట్లగును? పశు పక్ష్యాదులకు లేని బుద్ధి, మనస్సు, జ్ఞానము ఉన్న మానవుడు, వీటిని ఆధ్యాత్మిక ఉన్నతి కొరకు, వాడుకొనక, పోయినచో, అతడు రెండుకాళ్లు గల పశువుతో సమానమగుచున్నాడు. బుద్బుదప్రాయమగు మానవజన్మ ఎత్తినందుకు కాలము ప్రాపంచిక విషయములలో వృధాపుచ్చక, జన్మను సార్ధకము చేసికొని, శాశ్వతానందము పొందప్రయత్నము జేయవలయును. అట్టి శాశ్వతానందము పొందవలెనన్న దైవారాధనయే ఏకైకసాధనము. పరమేశ్వరుని కృపకు పాత్రులమగుటకు ఆయన్ని చిత్త ఏకాగ్రతతో భజించాలి, సేవించాలి. దీనికనేక మార్గాలు సూచించారు మనమహర్షులు. కొందరు నిష్కామకర్మద్వారా, భగవదనుగ్రహము పొందవచ్చని, కొందరు జ్ఞానమార్గముద్వార, భగవత్కృపకు పాత్రులగుదురని, కొందరు భక్తి ప్రపత్తులతో ఆయన్ని ఆశ్రయించి, ఆరాధించమని, అనేకవిధాలుగా సూచించిరి. కృతయుగమానవులు, నిరాహారదీక్షతో వందలాది సంవత్సరములు కఠోరనియమములతో తపస్సుజేసి దైవసాక్షాత్కారాన్ని పొందారు. త్రేతాయుగ, ద్వాపరయుగ వాసులు, యజ్ఞయాగాది క్రతువులతోను, సదాచార సంపత్తితో, నోములు, వ్రతములు, మానసిక దైవచింతనతోను, ఈశ్వరానుగ్రహంపొంది తరించారు. అయితే కలియుగ మానవులకు తరణోపాయమేది?

శ్రీమద్భాగవతంలో పోతనామాత్యుడునుడివినట్లు, కలియుగమానవులు సోమరులు, బలహీనులు, అల్పాయుష్కులు, మందబుద్ధులు. నిరంతరం గృహచ్ఛిద్రములలో తగుల్కొని, వా ప్రాపంచక విషయములతో సతమతమగుచు, మనశ్శాంతి లేక, రక్తపుపోటు, మధుమేహము మున్నగు వ్యాధులతో సమాజములోని జనాభాలో, హెచ్చు మంది బాధపడుచుండుట, చూచుచునేయున్నాము. వీరికి, యజ్ఞయాగాదులు, జపతపములు, చేయుటకు శక్తి, బలము, సమయము ఏవి? సంధ్యావందనాది నిత్య కర్మలు చేయుటకే తీరుబడిలేదు. గాన కలియుగమానవులు తరించుటకు భక్తి మార్గమొక్కటే సుకరము, నిరపాయము, క్షేమకరము. ఆదిశంకరుల నుండి, నేటి అవతార పురుషులైన శ్రీవిశ్వయోగి విశ్వంజీ మహారాజువరకు, కలియుగమానవులకు తరుణోపాయమని, భక్తిమార్గమే శ్రేయస్కరమనీ నొక్కి వక్కాణించి యున్నారు.

భక్తియననేమి? ఇది యెన్నివిధములు? మనముదారాపుత్రాదులమా, వస్తు వాహనములమా ప్రేమించురీతిగా భగవంతుని ప్రేమించుట భక్తియనబడును. భక్తి నవ విధములని శ్రీమద్భాగవతములో ఈ క్రింది శ్లోకముద్వారా తెలియుచున్నది.

శ్లో. శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనమ్

అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్

శ్రవణం: శ్రవణమనగా వినుట. భగవంతుడు మనకు చెవులు రెండు పెట్టి. వాటిని మూయుటకు వీలులేని రీతిలో నిర్మాణముగావించి, భగవత్కథలు బాగుగా వినమని ప్రబోధిస్తున్నాడు. మహాత్ముల సందేశములు విని తమజీవితములను సార్ధకము చేసికొన్న వారెందరోగలరు. పరీక్షన్మహారాజు శుకమహర్షుల వద్ద శ్రీమద్భాగవతము, సప్తాహదీక్షతో, (7రోజులలో) శ్రవణము గావించి, కైవల్యప్రాప్తిపొందినాడు. శ్రవణభక్తికి యిది చక్కని యుదాహరణము.

**2.** కీర్తనం: భక్తిమార్గములలో రెండవది కీర్తనభక్తి. కీర్తన యనగా కీర్తించుట, స్తోత్రము చేయుట. శ్రీహరిగుణగణములను భగన్నామములను గానముచేయుట. భగన్నామ సంకీర్తనచే ఏకాగ్రత శీఘ్రముగా కలుగును. పురాణకాలమందు తుంబురనారదాదులు, కలియుగమందు, అన్నమాచార్యులు, నారాయణతీర్థయతీంద్రులు, పురందరదాసు, భద్రాచల రామదాసు త్యాగరాజు. మీరాబాయి, తులసీదాస్, నామదేవ్, చైతన్యమహాప్రభువుమున్నగు వారెందరో, నామసంకీర్తనచే భగవద్గుణానుభవము చేసి, నాదోపాసనద్వారా, తరించుట యేగాక వారి అమూల్య సంగీత రచనల ద్వారా, ఆధ్యాత్మిక భిక్షప్రసాదించి, ఎందరికోమార్గదర్శకులైరి.

**3.** స్మరణభక్తి: స్మరణమనగా, మనయిష్టదైవమును, ఆయననామాన్ని (రామ, కృష్ణ శివ,

అంబ మున్నగు దేవతామూర్తులను) మనస్సులో జపించుట. ప్రహ్లాదుడు, భీష్ముడు మున్నగు భాగవతాగ్రేసరులెందరో, నిరంతరం భగవన్నామస్మరణ చేసి సిద్ధిపొందిరి.

4. పాదసేవనము : నాల్గవభక్తిపాదసేవనము. భగవంతుని పాదములనాశ్రయించుట అన్నమయ్య "బ్రహ్మకడిగినపాదము" అనుపాటలో, త్యాగరాజు "శ్రీరామపాదమా నీకృపజాలునే యనుకృతిలోను" పాదసేవన భక్తి ప్రాశస్త్యాన్ని వివరించారు. లక్ష్మణ, భరతాదులు, లక్ష్మీదేవిమున్నగువారు మహావిష్ణువు పాదసేవచేసిరి.

5. అర్చనం : స్వామియొక్క దివ్యమంగళవిగ్రహములను, దేవాలయమందుగాని, మనయింటిలోని పూజాగృహములందుగాని ప్రతిష్ఠాపన చేసికొని షోడశోపచారములతో నిత్యపూజలు చేసికొనుటయే అర్చన భక్తికి యుదాహరణము. పురాణయుగంలో ధ్రువుడు, అంబరీషుడు, మార్కండేయుడ్ను మున్నగువారు, కలియుగంలో ఎందరెందరో స్వామిని నిరంతరం అర్చించి, దైవానుభూతిపొందుచున్నారు.

6. వందన భక్తి : వందనమనగా నమస్కరించుట. అత్యంతభక్తి వినమ్రుడై, స్వామికి సాష్టాంగనమస్కారము చేయుట వందనభక్తి. త్యాగరాజస్వామివారు శహనరాగంలో "వందనమోరఘునందనా"యని రచించిన కీర్తన వందనభక్తి ప్రాముఖ్యాన్ని సూచిస్తుంది. తీరికలేకుండా నిరంతరం పనులలో నిమగ్నులై, ఉండువారు, దేవాలయమో, దేవుని విగ్రహమోకన్పించిన, అచట కొన్ని క్షణములు ఆగి, హృదయపూర్వకంగా, నమస్కరించిపోవుట, అచటచట చూచుచుందుము.

7. దాస్యమ్ : దాస్యమనగాసేవ. అహంకారాది దుర్గుణములను త్యజించి, సేవకుడను నేను అనుభావంతో దైవారాధన చేయుటయే దాస్యభక్తి. ఆలయములు, మఠములు, దైవకార్యములు జరుగు ప్రదేశముల యందు ఫలాపేక్షరహితముగా, ప్రదేశము ఊడ్చిశుభ్రము చేయుట, భక్తులకు ఉచిత అన్నపానాదులు, ఉచిత వసతి కల్పించుట మున్నగునవి దాస్యభక్తి కుదాహరణములు. రామాయణకాలమునందు ఆంజనేయస్వామి సీతారాములకు దాస్యము జేసి "దాసాంజనేయ" నామముతో ఖ్యాతిగాంచెను.

8. సఖ్యమ్ : "అద్వేష్టాసర్వభూతానాం మైత్రః కరుణ యేవచ" అని గీతావాక్యము. పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్తజీవుల యెడస్నేహభావంతో యుంటూ, దేవుని పట్లగూడా అట్టిచనువుతో నుండుట సఖ్యభక్తి. త్యాగరాజు ఎంతో స్నేహభావంతో రామచంద్రమూర్తిని "రారామాయింటిదాక" (అసావేరిరాగం) యనియు, భద్రాచలరామదాసుశ్రీరాముడిని ఏమిరారామా, నావల్లనేరమేమిరా"యని సంబోధించుట పరమాత్మతో ఈ భక్తగాయకులకు గలచనువు, సాన్నిహిత్యాన్ని తెలుపుతున్నవి. అర్జునుడు, కృష్ణుడినిబావా"యని సంబోధించుట సఖ్యభక్తికి యుదాహరణము.

(సశేషం)

# అనుభవతరంగిణి

- శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

(గతసంచిక తరువాయి)

గుంటూరులోని ప్రభుత్వ పాలిటెక్నిక్ కాలేజీలో సివిల్ ఇంజినీరింగ్ శాఖలో లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీచుంబల్కర్ నాగరాజుకు మాస్టరు గారు రైలుపేటలో గది అద్దెకుతీసుకొని ఉంటున్నప్పటి నుంచి బాగా తెలుసు. ఆయన నివాసం ఉంటున్నది కూడా ఆనందతీర్థ అగ్రహారంలోనే కావటంచేత మాస్టరు గారి కుటుంబానికి కూడా ఆయన సుపరిచితుడు. ఆయన మాస్టరుగారి దగ్గరకు తరచుగా పోయివస్తూండేవాడు. ఆయన మాస్టరుగారిచ్చే హారతులు చూచి ఒకరోజు "ముద్దలు ముద్దలు ఇంత కర్పూరం రోజూ మాస్టరుగారు హారతిస్తున్నారే! ఇంత ఖర్చు చెయ్యటం ఎందుకు? కర్పూరం కాస్తవేసి హారతిస్తే సరిపోదా?" అని మనస్సులో అనుకొన్నాడు. ఇంత దుబారా ఖర్చుచేస్తున్నారేమిటి? మాస్టరుగారు అనుకొంటూ.

హారతివ్వటం అయిపోయింతరువాత మాస్టరుగారు ఆయన్ను చూచి "నాగరాజా! ఇంతమంది ఖర్మలు తొలగాలంటే ఇంతకర్పూరం వేసి హారతివ్వాలి - లేకపోతే అవిపోవు" అన్నారు. గంభీరంగా  నాగరాజుకు ఆమాట వినంగానే ఆశ్చర్యం కలిగి, స్తబ్ధుడయ్యాడు. తాను మనస్సులో అనుకొన్నమాట మాస్టరుగారికి ఇట్టే తెలిసిపోయింది. ఆయన సర్వజ్ఞులు అనే భావం రేకెత్తింది. నాగపూర్ కోటీశ్వరుడైన బూటీగారి అల్లుడు నార్కే "మొట్టమొదటిసారిగా షిర్డీ వెళ్ళినప్పుడు, హారతిసమయంలో మిగులకోపోద్దీపితుడై అరుస్తూ, చిందులుతొక్కుతున్న బాబాగారిని చూచి" ఈయనవట్టి పిచ్చివాడిలాగా ఉన్నాడే!" అనుకొన్నాడు. ఆతర్వాత తన బసకు తిరిగిపోయి, సాయంత్రం మళ్ళీ బాబాగారిదగ్గరికి వెళ్ళాడు. బాబా ఆయన్నుచూచి "నేను పిచ్చివాణ్ణి కాదు" అని ఆయన్ను ఆశ్చర్యపరచిన విషయం అప్పుడు నాగరాజుకు జ్ఞాపకం వచ్చింది. "మాస్టరుగారు సాయిస్వరూపులు. వారికి తెలియకుండా ఏరహస్యాలను మనం దాచిపెట్టలేం. మాస్టరుగారు నా హృదయంలోనే ఉన్నారు. ఆయన నా ఆత్మయొక్క అంతరాత్మ" అనుకొన్నాడు. అప్పటినుంచి ఆయనకు మాస్టరుగారంటే మరింత గురి ఏర్పడింది.

గుంటూర్లో ఆయన ఒక ఇల్లు కట్టుకోవాలని పైసాపైసా కూడబెట్టి ఆ మొత్తాన్ని ఉమ్మడియార్ బ్యాంకులో ప్రతినెలా డిపాజిట్టు చేస్తుండేవాడు. అట్లా ఆయన యాభైవేలకు పైగా కూడ బెట్టాడు. అకస్మాత్తుగా ఆ బ్యాంకు దివాలా తీసింది. కష్టార్జితమైన అంత డబ్బుపోయింది. "స్థలం కొనుక్కొని తీరా ఇల్లు కట్టుకోవాలనుకొంటున్న సమయంలో ఇట్లా అయిందేమిటి? భగవంతుడా!" అని ఆయన దిగులు పడ్డాడు. ఆపద్బాంధవులైన మాస్టరుగారి దగ్గరకుపోయి విషయమంతా చెప్పి కన్నీళ్ళు పెట్టుకున్నాడు. మాస్టరుగారు ఆయన్నుచూచి "మరేం ఫరవాలేదు - విచారపడకు! త్వరలోనే నువ్వు ఇల్లు కట్టుకొంటావ్" అన్నారు దృఢంగా. తన చేతిలో చిల్లిగవ్వకూడా లేనిస్థితిలో మాస్టరుగారు ఇట్లా అంటున్నారేమిటి? ఇది సాధ్యమయ్యే పనేనా?" అనుకొన్నాడు. ఆతర్వాత ఒకవారంపది రోజులకు, ఆయన తోడల్లుడు (షడ్డకుడు)

శ్రీ ఆది కృష్ణమూర్తి, ఆయన అడక్కుండానే పదివేలరూపాయలు తీసుకొచ్చి, ఇచ్చి మా అమ్మాయి పెళ్ళిసమయానికి ఇవ్వు! ఇప్పుడేమీ తొందరలేదు. ముందు నీ ఇంటిపనులు మొదలుపెట్టు!" అని చెప్పాడు. వాళ్ళమ్మాయి పెళ్ళి ఇంకా పదేళ్ళపైమాట. ఆ అమ్మాయి కి అప్పుడు పెట్టుపోతలు పదేళ్ళకుగానీ లేవు. ఈ పదివేలతో ఇంటి పని ఏంఅవుతుంది? డబ్బు బ్యాంకులో వెయ్యాలో? ఇంటిపనులు మొదలుపెట్టాలో? ఆయనకు అర్థం కాలేదు. మాస్టరుగారి దగ్గరకు సలహా అడుగుదామని వెళ్ళాడు. మాస్టరుగారు ఆయన్ను చూచి "నాకు ఒకరెండువేలివ్వు! అవసరంవచ్చింది" అని ఆయన నుంచి రెండువేలు తీసుకొని," ఇల్లు కట్టటం మొదలుపెట్టు! త్వరలోనే పూర్తిఅవుతుంది" అన్నారు. నాగరాజుకు మతిపోయింది. పదివేలు చేతిలో ఉండేనే చాలదనుకొంటుంటే - అందులో రెండువేలు తీసుకొని, పనిమొదలుపెట్టమంటున్నారేమిటి చెప్మా! మాస్టరుగారు. ఈ డబ్బు ఇంటి పనులకు ఏమూలకువస్తుంది?" అని ఆయన డీలాపడ్డాడు.

"మాస్టరుగారి వాక్కు వేదవాక్కు. వారు చెప్పినట్లు చెయ్యాలి కద!" అని ఆయన ఇంటినిర్మాణం తాలూకు పనులు ప్రారంభించాడు. ఆయన అవసరాన్ని గమనించి మిత్రులు కావలసిన ఆర్థిక సహాయం చేశారు. రెండుమూడు నెలలలోనే చక్కటి డాబా ఇల్లు నిర్మాణమైంది. ఆ ఇల్లు పూర్తికాగానే ఆయన సంతోషంతో మాస్టరుగారి దగ్గరకి పోయి, ఇల్లు పూర్తి అయిన విషయం చెప్పి, గృహప్రవేశానికి ముహూర్తం నిశ్చయించేసుకొన్న విషయం చెప్పి, మాస్టరుగారిని గృహప్రవేశానికి దయచేయవలసిందిగా ఆహ్వానించాడు. ఆరోజు ఆయన దగ్గర తీసుకొన్న రెండువేలరూపాయిలు ఆయనకు మాస్టరుగారు తిరిగిఇస్తూ "నీ దగ్గిర అప్పుడు డబ్బు ఎందుకు తీసుకొన్నానో తెలుసా? నీ ఇంటిపని ఆగకుండా త్వరలో పూర్తికావటంకోసం. నీ ప్రారబ్ధాన్ని పరిహరించడానికి అట్లాచెయ్యవలసివచ్చింది" అన్నారు. "మాస్టరుగారు ఎప్పుడేంచేస్తారో? ఏంమాట్లాడుతారో మనకు తెలీదు. ఆయన మాటలకు - చర్యలకూ ఒక అర్థం ఉంటుంది. అదిముందుగా మనకు తెలీకపోయినా, ఆ తర్వాత కొన్నాళ్ళకు మనకేతెలుస్తుంది. వారెప్పుడూ భక్తుల యోగక్షేమాలనే కాంక్షిస్తుంటారు"నే సత్యం అప్పుడు నాగరాజుకు బోధపడింది. "మాస్టరుగారు డబ్బుఅడిగితీసుకొన్నప్పుడు వారిని అపార్థం చేసుకొన్నానే!" అని ఆయన చాలా పశ్చాత్తాపపడ్డాడు.

దసరాలో భక్తులు మాస్టరుగారిని శ్రీ లలితా త్రిపురసుందరిగాభావిస్తూ ప్రతిరోజు లలితాసహస్రనామాలతో పాదపూజలు చెయ్యటం పరిపాటి. కుమారీ పూజలుకూడా అప్పుడు జరుగుతూఉంటాయి. అఉత్సవాల్లో ముత్తైదువులకు రవికబట్టలు పెట్టటం ఒక ఆనవాయితి. ఒక పర్యాయం దసరా ఉత్సవాలు తిలకించాలని నాగరాజు విశ్వమందిరానికి వచ్చాడు. ఆనాడా పూజానంతరం మాస్టరుగారు ముత్తైదువలందరికీ రవికగుడ్డలు పంచిపెడుతున్నారు. అదిచూచి "నాకుకూడా ఒక రవికగుడ్డ ఇస్తే బావుండు - మాస్టరుగారు" అని ఆయన అనుకొన్నాడుతనలో. వెంటనే మాస్టరుగారు ఒకరవికగుడ్డ బంతిగా చుట్టి, నాగరాజు వొళ్ళోపడేటట్లు విసరివేశారు. మాస్టరుగారి దగ్గర నుంచి అనుకోని ప్రసాదం పొందినదాని ఫలితంగా బ్యాంకుల్లో తాకట్టుపెట్టిన బంగారంపై వడ్డీమాఫీ చేస్తూ ప్రభుత్వం ఆర్డరు జారీ

చేయటంవల్ల బ్యాంకులో ఆయన తాకట్టుపెట్టిన బంగారంపై వడ్డీ మాఫీ అయింది. ఆర్థికంగా నిలవదొక్కుకోవడ కి, మనస్సు స్థిమితపడడానికీ ఆయనకు అందువల్ల వీలు దొరికింది.

ఒకసారి ఆయన తల్లి ప్రమాద స్థితిలో ఉందనీ వెంటనే బయలుదేరిరమ్మనీ టెలిగ్రాం వచ్చింది. అది చూచి ఆయన కంగారు పడుతూ, ఆశీస్సుల కోసం మాస్టరుగారి దగ్గరకు పోయి, పాదనమస్కారం చేసి, విషయమంతా చెప్పి ఆశీస్సులు అర్థించాడు. మాస్టరుగారు ఆయన చెప్పిన మాటలు పట్టించుకోకుండా, మరెవరితోనో మాట్లాడుతూ ఉండిపోయారు. అందరికీ పెట్టేబొట్టుకూడా వారు నాగరాజుకు ఆరోజు పెట్టలేదు. ఆయనకు నిరాశ కలిగింది. ఆ తర్వాత నాలుగైదురోజులకు నాగరాజు తల్లి మరణించింది. మరోసారి ఆయన తండ్రిగారికి సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వస్తే, అది తీసుకొని ఆయన మాస్టరు గారి దగ్గరకు వెళ్ళాడు. మాస్టరుగారు ఎంతో దయతో ఆయన్ను దగ్గర కూచొబెట్టుకొని, సానునయంగా 'ఏం ఫరవాలేదు. కంగారు పడకు! మీనాన్నకు ఆరోగ్యం చక్కపడుతుంది' అని ఇన్నివిభూతి పొట్లాలు ఆయన చేతిలో పడవేశారు. మాస్టరుగారు చెప్పినట్లే ఆయన తండ్రి గారి ఆరోగ్యంకుదుటపడింది. ఆతర్వాత తండ్రీ కొడుకులిద్దరూ విశ్వమందిరానికి వచ్చి, మాస్టరుగారిని దర్శించి ఆశీస్సులు పొంది వెళ్ళారు.

నాగరాజు తండ్రి శ్రీరామమూర్తిరావు మాస్టరుగారి దగ్గరకు వచ్చినప్పుడు అనంతపూర్‌లో ఉంటున్న తమచిన్నకొడకూ, చిన్నకోడలీమధ్య అన్యోన్యతలోపించిందనీ, తనకోడలు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూ, ఇంటివిషయాలేవీ పట్టించుకోవడంలేదనీ, తామెంత చెప్పినా ఖాతరు చెయ్యటంలేదనీ చెప్పి, ఆకుటుంబాన్ని ఎల్లాగైనా సరే సరిచేయవలసిందని ప్రాధేయపడ్డాడు. మాస్టరుగారు ఆయనకు విభూతిప్రసాదంతో బాటు, దత్తాత్రేయస్వామి, షిర్డీసాయిబాబా, తానూ ముగ్గురూ ఉన్న ఫోటో ఒకటి ఇచ్చి మరేంఫరవాలేదు - ఒకసంవత్సరంలో అంతా కుదుటపడిందని మీరేనాకు లెటర్‌వ్రాస్తారు. చూస్తూ ఉండండి!'' అన్నారు. మాస్టరుగారు చెప్పినట్లే ఆకుటుంబం చాలా వరకు కుదుటపడింది.

రామమూర్తిరావుగారి రెండోకొడుకు మదరాసులో ఇంజనీరుగా ఉంటున్నాడు. ఆయన భార్య అన్ని విషయాల్లో భర్తకు విరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉండేది. భర్త వైపు బంధువులెవరు తమ ఇంటికి వచ్చినా ఆమెకు ఇష్టం ఉండేదికాదు. ఉత్తరాలు ఎన్నివ్రాసినా సమాధానం వచ్చేదికాదు. ఇట్లా ఆభార్యాభర్తల కాపురం పెనం మీది గుగ్గిలంగా ఇరవైయేళ్ళు సాగింది. రామమూర్తిరావుగారికి మాస్టరుగారితో చెప్పి, వారి ఆశీస్సులు తీసుకొంటే ఏమైనా ప్రయోజనం లభిస్తుందేమో?నన్న ఆశతో మాస్టరుగారి దగ్గరికి వచ్చి, విషయమంతా విన్నవించాలని 'మద్రాసులో మా రెండవ అబ్బాయి....'' అని అంటూ ఉండగానే మాస్టరుగారు మధ్యలోనే ఆమాటలు త్రుంచి "పరిస్థితి చెయ్యిదాటిపోయింది. ఇప్పుడు మనమేమీ చెయ్యలేం. చేతులుకాలినతర్వాత ఆకులు పట్టుకొని లాభమేమిటి?'' అన్నారు. రామమూర్తి రావు హతాశుడై వెళ్ళిపోయాడు.

ఒక సమయంలో తనను గుంటూరు నుంచి వేరే చోటుకు బదలీ చేసి, వేరే వ్యక్తిని

తన స్థానంలో నియమించాలని కాలేజీ ప్రిన్సిపాలు, జాయింట్ డైరక్టరు మొదలైనవాళ్ళంతా గట్టిగా ప్రయత్నాలు చేస్తున్నారనే విషయం నాగరాజుకు తెలిసింది. అప్పటి పరిస్థితుల్లో ఆయన కొంతకాలం గుంటూర్లోనే ఉండవలసిన అవసరం ఉంది. తన ట్రాన్స్ఫర్ మూలంగా తనకుటుంబం విషమసమస్యలను ఎదుర్కోవలసి వస్తుందన్న భయంతో, ఆయన మాస్టరుగారి దగ్గరికి వచ్చి, "ట్రాన్స్ఫర్ ఆగిపోయేటట్లు అనుగ్రహించమని ప్రాధేయపడ్డాడు. మాస్టరుగారు కళ్ళు మూసుకొని, రెండునిమిషాలు ధ్యానంలోకి పోయి, కళ్ళు తెరిచి, "మరేంఫరవాలేదు - ఎవరు ఎన్ని ప్రయత్నాలు చేసినా నువ్వు గుంటూర్లోనే ఉంటావు. ట్రాన్స్ఫర్‌కాదు''అని విభూతి ప్రసాదం ఇచ్చి ఆశీర్వదించారు. మాస్టరుగారి దగ్గర ఉన్నవాళ్ళు చాలామంది- నాగరాజ్‌తోబాటు "ఈయన ఇక్కడకూచోని ఇట్లాచెబుతున్నారు. ఇది అయ్యేపనేనా? అక్కడ ఒక వైపు హేమాహేమీలు గట్టిగా ప్రయత్నిస్తున్నారు'' అని అనుకొన్నారు. కానీ విచిత్రం. మాస్టరుగారి ఆశీస్సుల ఫలితంగా నాగరాజు ట్రాన్స్ఫర్ ఆగిపోయింది.

మాస్టరుగారి ఆశీస్సులతో నాగరాజు తన రెండోకూతుర్ని-కుసుమాబాయిని - డాక్టరు వ్యాఘ్రేశ్వరరావు గారి దగ్గరకు తీసుకుపోయి, ఆమెపోలియో కాళ్ళకు రెండింటికీ ఉచితంగా ఆపరేషన్ చేయించి, సరిచేయించాడు. ఆతర్వాత రెండేళ్ళకు మాస్టరుగారి ఆశీస్సులతో మళ్ళీ డాక్టరు కైలాసరావు గారిచే ఆపరేషన్ చేయించి, ఆ అమ్మాయి రెండుకాళ్ళనూ ఇంకా కాస్తబాగా సరిచేయించాడు. తత్ఫలితంగా ఇప్పుడు ఆ అమ్మాయి చక్కగా నడవగలుగుతున్నది. మాస్టరు గారి ఆశీస్సులతో ఆయన తన పెద్దమ్మాయి నాగామృతబాయి పెళ్ళి వైభవంగా జరిపించాడు. ఆఅమ్మాయికోపాప పుట్టింది. మనవడుకాక పాపపుట్టిందని ఆ అమ్మాయి అత్తగారికొక బాధగా ఉండేది. రెండేళ్ళు తిరక్కుండానే మాస్టరుగారి ఆశీస్సువల్ల ఆ అమ్మాయికి కవలపిల్లలు పుట్టారు. ఇద్దరు మగపిల్లలే. ఆ అమ్మాయిని అత్తగారింట్లో అంతా ఇప్పుడు పువ్వుల్లో పెట్టిచూస్తున్నారు మాస్టరుగారి దయవల్ల నాగరాజుకు మనశ్శాంతి లభించింది. మాస్టరుగారు నాగరాజుకు ఇలవేల్పుఅయ్యారు. ఈనాడు ఆయన కుటుంబం యావత్తు మాస్టరుగారికి దాసాను దాసులు.

ఒక రోజు సాయంత్రం జి.వి. సుబ్బరామయ్య గారు ధ్యానానికి కూర్చోబోతుంటే - వారి చిన్న బిడ్డ ఇందిర అన్నం పెట్టమని ఏడుస్తోంది. ధ్యానం పూర్తి చేసుకు వచ్చి పెడతానని కసురు కుంటున్నారు తండ్రి. ఇంతలో అటే వస్తున్న భగవాన్ " వాత్సల్యంలేని ధ్యానమెందుకు? పిల్లలు ఎక్కడ సంతోషంగా ఆడుకుంటూ ఉంటారో అదే దేవలోకం'' అన్నారు. బిడ్డలపై భగవాన్ చూపిన వాత్సల్యానికి గృహస్థుడైన సుబ్బరామయ్య సిగ్గుపడ్డాడు.

- మహాత్ముల మహావాక్యాలు - పుట 92

సేకరణ కీ.శే. కలిదిండి రామరాజు

# సర్వార్థ సంక్షేమ సమితి,

501, ప్రదీప్ అపార్ట్‌మెంట్, గాంధీనగర్, హైదరాబాద్ - 380.

*సభ్యులుగా చేరండి - ధార్మిక సేవలో పాల్గొనండి*

| | | సర్వార్థ సంక్షేమ సమితి సభ్యత్వవివరములు | విశ్వప్రకాశం సభ్యత్వవివరములు |
|---|---|---|---|
| 1 | మహారాజపోషకులు | రు. 1,00,000-00 | రు. 15,000-00 |
| 2. | రాజపోషకులు | రు. 50,000-00 | రు. 10,000-00 |
| 3. | పోషకులు | రు. 25,000-00 | రు. 5,000-00 |
| 4 | కార్యనిర్వాహక సభ్యత్వము | రు. 10,000-00 | |
| 5 | శాశ్వత సభ్యత్వము | రు. 1,000-00 | రు. 1,000-00 |
| 6 | వార్షిక సభ్యత్వము | రు. 100-00 | రు. 60-00 |
| 7. | ద్వివార్షిక సభ్యత్వము | | రు. 120-00 |
| 8 | విడి ప్రతి | | రు. 5-00 |

పై సభ్యత్వములకు ఛెక్కు లేదా డి.డి. ద్వారా లేదా నగదు రూపకంగాను స్వీకరించబడును. మరియు 80 G ఇన్‌కంటాక్సు లబ్ధి పొందవీలగును.

*విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రికకు*
*ప్రకటనలు పంపండి, ప్రోత్సహించండి*

## పత్రికా ప్రకటన వివరములు

| | | |
|---|---|---|
| 1. | వెనుక కవరు పేజీ | రు.2,500-00 |
| 2 | రెండవ కవరు పేజీ | రు.1,500-00 |
| 3. | మూడవ కవరు పేజీ | రు.1,500-00 |
| 4. | లోపలి పూర్తిపేజీ | రు. 500-00 |
| 5. | 12 మాసాలకు 12 సంచికలకు చిన్నసైజులో | రు.2,500-00 |




ఆలయములు వేరైనా ఆరాధికుడొక్కడే.

మానవతే మానవుని ప్రథమ

**BOOK POST** **Printed Matter**

To

Smt & Sri. .... .......

... .... ........ . Sri.Dr.B.RAMA RAJU

1-8-117/2,Chikkadpalli, . . .

........ .......... .. HYDERABAD.20. ......

.....................

*if undelivered please return to*

**SARVAARTHA SANKSHEMA SAMITHI**

*3-6-393, Plaza Apartments, Street No. 3,*

*Himayatnagar, Hyderabad - 500 029.*